## చిత్రకారుని గురించి



ఫ్రాయాంజెలికో
(1395-1455)

ఫ్రాయాంజెలికో పేదరికాన్ని జీవన నియమంగా పెట్టుకొన్న డొమినికన్ మత వ్యవస్థలో చిన్ననాడే సభ్యుడయ్యాడు. ఆ తరవాత అందులో ముఖ్యంగా వ్రాత ప్రతులకు అలంకారంగావించే కళాకారుడుగా పనిచేశాడు. ఇతడు చాల పవిత్రమైన వ్యక్తి. ఈ ప్రపంచ విషయలోలత, పటాటోపం, జంఝాటం అతనిని ఆకర్షించలేదు. మతానికి సంబంధించని దేనిని అతడు దరిచేయనీయలేదు. మతం తరవాత అతడు ప్రేమించిన రెండో విషయం కళ.

అతడు మతవాదులను, లౌకికవాదులను - ఇరువర్గాలను ఆకర్షించగలిగాడు. అతనికి కళా సంబంధమైన అనేక పనులు అప్పగించబడ్డాయి. అతడి తొలి కళాఖండాలలోనే కొన్ని పునర్వికాస భావ లక్షణాలు గోచరించాయి. అతడు తనకు తెలిసిన రంగుల జ్ఞానాన్ని, దృక్కోణాలను, ఛాయాభేదాలను తన పానెల్ పెయింటింగ్స్‌లో ప్రయోగించాడు. ఆ కాలంలో ఈ పెయింటింగ్స్ అందరిని ఆకట్టుకొన్నాయి. కాని అతడు గృహాంతర్భాగాల కప్పుల అడుగుభాగాలలో చిత్రించిన జలవర్ణ చిత్రాలు అతనికి విపరీతమైన ఖ్యాతిని ఆర్జించి పెట్టాయి. ఈ కుడ్య జలవర్ణచిత్రాలు మహాగొప్పదైన ఇటలీ స్మారక చిహ్నాలాలంకరణ సంప్రదాయంలో అంతర్భాగాలైపోయాయి.

ఫ్రాయాంజెలికో కేవలం ఒక అమాయక సన్యాసికాదు. అతడు సన్యాసేకాదు వృత్తిరీత్యా కళాకారుడు. అతడు విశ్వాసే, కాని అతని విశ్వాసానికి మానవతావాదం రంగు పులిమింది.

ఇతడు ఖచ్చితంగా ఎప్పుడు పుట్టిందీ తెలియదు. ఆధునిక కళాకారులు ఇతడు 1395-1400 మధ్య పుట్టాడని లెక్కగట్టారు. ఫ్లారెన్స్ సమీపంలోని వచ్చియోలో పుట్టాడు. 1445లో జలవర్ణ చిత్రాలు చిత్రించడానికి వాటికన్‌కు రావించబడ్డాడు.
ఇతడెప్పుడూ మత సంబంధమైన దేవతల చిత్రాలనే చిత్రించాడు. ఇతనిని చేతిలో కుంచె ఉన్న దేవదూతగా వర్ణించారు. ఇతడు క్రీస్తును శిలువ వేస్తున్న చిత్రాన్ని చిత్రించేటప్పుడు కన్నీరు మున్నీరుగా విలపించాడట.

## ముఖచిత్రం గురించి

"క్రీస్తుకు తాను తల్లి కావల్సి ఉందని మేరీ కన్యకు దేవదూత తెలియజేయడం." ఇది నిస్సందేహంగా ఫ్రాయాంజెలకో చి[illegible]చిన ప్రథమ చిత్రం. స్తంభాలతో పరివేష్టితమైన వృత్తాకార కప్పు క్రింద దేవదూత ప్రకటన వినడానికి మేరీ కన్య ముందుకు వంగు[illegible]ది.

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." - Dammapada.**

సంపుటి 13 జనవరి 2002 సంచిక 1

వ్యవస్థాపక సంపాదకుడు : **డాక్టర్ రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయ సూచిక



**విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/- విదేశీయులకు $ 20**

ముఖచిత్రం : **ప్రకటన**

చిత్రకారుడు : **ప్రాయాంజెలికో**

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. 'X' Roads, Musheerabad, Hyd - 20. Ph. 7645536
E-mail : misimieditor@rediffmail.com

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# మిసిమి అభ్యర్థన

'మిసిమి' పన్నెండు సంవత్సరాలు విజయవంతంగా తనదైన పథంలో ముందుకుసాగి, పదమూడో సంవత్సరంలో అడుగిడే సందర్భాన తన పాఠకులకు హృదయ పూర్వక నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేసుకొంటున్నది.

నవంబరు 4వ తేదీన ఆవిష్కృతమైన, మిసిమి వ్యవస్థాపక సంపాదకుల జీవన సారాన్ని వెలువరించే 'రవీంద్ర స్మృతి' ని మిసిమితో పరిచయం ఉన్న చాలమంది చూసే ఉంటారు. అందులో ఆయన మూర్తిమత్వావిష్కారం 'నిండు'గానే జరిగిందని అనుకొంటున్నాము. అటువంటి 'రవీంద్రస్మృతి' రూపు దిద్దుకోవడానికి ఆయన్ను 'ఎరిగి' రాసిన రచయితలకు, కళాజ్యోతి యాజమాన్యానికి, కళాజ్యోతి ఉద్యోగులకు, కళాకారులకు, నడుముకట్టి నిలబడ్డ రవీంద్ర మిత్ర బృందానికి కృతజ్ఞతలు తెలుపు కొంటోంది మిసిమి.

లోగడ ఒకసారి 'మిసిమి'లో 'రచయితల కాటకం' అనే శీర్షికతో రచయితలకు ఒక వినతిని ప్రకటించడం జరిగింది. పాఠకుల సంఖ్య పెరిగినా, ఆ నిష్పత్తిలో మిసిమి ఆశించిన రీతిలో రచయితలు ముందుకు రావడం లేదు.

ఎక్కువగా సాహిత్య సంబంధ వ్యాసాలు మాత్రమే మిసిమి కార్యాలయానికి చేరుతున్నాయి. మానవ జీవనానికి సంబంధించిన అన్ని పార్శ్వాలను ప్రతిబింబించే రచనలు కావాలని మిసిమి ఆకాంక్ష. సంస్కృతి, చరిత్ర, తత్వం, మనో విజ్ఞానం, కళ, సాహిత్యం, సామాజిక సంబంధాలు, **సాహితీ** విమర్శ, విజ్ఞానం, విలువలు మొదలైన అన్నిరంగాలకు చెందిన రచనలను ప్రచురించి మనిషి మనోవికాసానికి దోహదం చేయాలని, సమాజంలో ఉత్తమాభిరుచులను పెంపొందించాలని మనిషిని మనిషిగా చూడాలని మిసిమి వాంఛిస్తోంది.

ఉత్తమాభిరుచులంటే ఏ ఒక వర్గానికో, శాఖకో, మతానికో, జాతికో చెందినవి కానవసరం లేదు. సార్వత్రికతను సంతరించుకొన్న 'మానవ విలువలను' ప్రతిబింబిస్తేచాలు.

రచయితలకు మరో మనవి : ఒక ప్రక్క మిసిమి ఆశిస్తున్న ప్రమాణాలను ఆశంసలను దృష్టిలో ఉంచుకొంటూనే, విషయాన్ని వ్యక్తీకరించేటప్పుడు, ''కేవలం యథాతథ విషయప్రదర్శన'' కాక, మీదైన కోణం, పార్శ్వం, వెలుగు (అంటే మీరు చేసే వ్యాఖ్యానంలో ఒక నూతన దృక్కోణం) - ఆ అంశానికి విషయానికి ఆరోపితం కావాలి. రచన కేవలం ఏ డాక్యుమెంటరీలాగానో, రైల్వే టైం టేబిల్‌లాగానో ఉండరాదు.

ఈ విషయాలను దృష్టిలో ఉంచుకొని మిసిమి అభ్యర్థనను మన్నించి, తన మనుగడకు తోడ్పడుతారని ఆశిస్తోంది.

'మిసిమి' ఎవరి నుంచి ఆర్థిక సహాయ సహకారాలు కోరడం లేదు. కేవలం ఉత్తమ అభిరుచులతో, వైవిధ్యంతో, మనిషిని కేంద్రంగా చేసుకొని చేసే రచనలను అభిలషిస్తోంది.

– **'మిసిమి'**

# తెలుగు సాహిత్యంలో రామాయణ విమర్శ

- టి. రవిచంద్

రామాయణాన్ని ఆదికావ్యంగా, వాల్మీకిని ఆదికవిగా, రాముణ్ని అవతార పురుషుడిగా హిందువులు విశ్వసిస్తారు. వాల్మీకికి ముందు రామకథలు అనేకం ప్రచారంలో ఉన్నాయని, వాటన్నింటిని సంకలనం చేసి, గ్రంథస్తం చేసిన ఘనత ఆదికవి, ఆది ఎడిటర్ వాల్మీకిదని కొందరు విమర్శకులు భావించారు. మధ్యయుగాల నుండి ఆధునిక యుగం వరకు వాల్మీకి రామాయణ ప్రభావం హిందూ సంస్కృతిపై, హిందూ ప్రజల మనోభావాలపై బలంగా ఉంది, ఇది కాదనలేని నిజం. వాల్మీకి ముందు ఉన్న రామకథల ప్రభావం ఒక్క హిందూమతం పైనే కాకుండా అవైదికాలైన జైన, బౌద్ధ మతాలపై కూడా ఉంది. రామకథ అబ్రాహ్మణ మతాలైన బౌద్ధ, జైన మతాల్ని, వారి సాహిత్యాన్ని ప్రభావితం చేసిందనడానికి కావాల్సినంత సాహిత్యాధారాలున్నాయి. సమకాలిక భారతదేశంలో కొన్ని మతశక్తులు రామాయణాన్ని, రాముణ్ని తమ రాజకీయ ప్రయోజనాలకు సాధనంగా వాడుకొంటూ, దానినుండి రాజకీయ లబ్ధి పొందటానికి ప్రయత్నిస్తున్నాయి. ఈదేశ చరిత్రలో ఇంతకముందు ఏమతస్థులూ ఒక కావ్యాన్ని, కావ్య నాయకుణ్ని, చరిత్రగా, చారిత్రక పురుషుడిగా భావించి ఇంత అలజడిని, ఆందోళనను సృష్టించలేదు. ప్రజల మనోభావాల్ని గాయపరచలేదు. రామాయణ గాథకు చారిత్రక ఆదారమే లేదా, ఇది ఒక కవి స్వకపోల కల్పితమేనా అనే సందేహం రావచ్చు. చారిత్రక దృష్టితో రామకథను పరిశీలించటం వేరు; తమ దృష్టితో దాన్ని చారిత్రక సంఘటనగా భావించటం వేరు. ప్రాచీనకాలంలో అనేక దేశాల్లో మతగాథలు, పురాణాలు, కావ్యాలున్నాయి. అవి ఆయాదేశాల్ని ప్రభావితం చేశాయి. ఆధునిక యుగంలో ఆయా దేశాల వారు తమ మత గ్రంథాలకు, పురాణాలకు చారిత్రక ఆధారాలు ఏమయినా ఉన్నాయా అని పురాతత్వ త్రవ్వకాలు, పరిశోధనలు జరిపారు, జరుపుతున్నారు. కొత్త సత్యాలు వెలికి తీస్తున్నారు. పాత కట్టుకథల్ని వదిలించుకొంటున్నారు. ఆధునిక యుగంలో మన దేశంలో కూడా రామాయణ, మహాభారతాలు జరిగాయంటున్న ప్రదేశాలలో త్రవ్వకాలు జరిగాయి, జరుగుతున్నాయి. ఈ త్రవ్వకాల్ని, పరిశోధనల్ని ఎవరూ వద్దనరు, తిరస్కరించరు. ఏ మతాభిమానం, మత విద్వేషం లేకుండా ఈ దేశ ప్రాచీన సంస్కృతిలో భాగంగా రామాయణ, మహాభారత గాథల్ని, అవి జరిగాయని విశ్వసిస్తున్న ప్రాంతాల్లో పురాతత్వ పరిశోధనలు జరుపవచ్చు. సత్య నిరూపణకు ప్రయత్నించవచ్చు. ఆ మేరకు ఎవరికీ ఎటువంటి అభ్యంతరం ఉండనక్కర్లేదు. కాని మత సంఘర్షణ దృష్టితో చరిత్రను వాడుకోవాలనుకోవటం, తమ మూఢ మతవిశ్వాసాల్ని చారిత్రక విషయాలుగా భావించి ప్రచారం చేసి, ఉమ్మడి సంస్కృతిని విచ్ఛిన్నంచేసే ప్రయత్నాన్ని ఎవరూ హర్షించరు. రామాయణ గాథకు చారిత్రక ఆధారం ఏమయినా ఉందా అని పరిశోధించిన వారు, ఆ ప్రాంతాలలో త్రవ్వకాలు జరిపి, ఇతర ఆధారాలతో వాటిని తులనాత్మకంగా అధ్యయనం చేసి కొన్ని నిర్ధారణలకు వచ్చిన పురాతత్వశాస్త్రజ్ఞులలో చెప్పుకోతగినవారు బి.బి.లాల్, హెచ్.డి. సంకాలియాలు. వీరు

టి. రవిచంద్, గుంటూరు, ప్రముఖ పాత్రికేయుడు, మిళింద పబ్లికేషన్స్ అధినేత

రామాయణాన్ని పుక్కిటి పురాణగాథగా కొట్టివేయలేదు. ప్రస్తుతం ప్రచారంలో, వాడుకలో ఉన్న రామాయణం కల్పనగా సంకాలియా భావించినా, అది చరిత్ర (ఇతిహాసం) కాదు, పురాణం (సాంప్రదాయిక చరిత్ర) కాదు. అది కేవలం కావ్యమని (Poem) తీసివేయలేదు. సుప్రసిద్ధ రామాయణ విమర్శకులు నార్ల వెంకటేశ్వరరావు భావించినట్లు వీరిద్దరు ''రామాయణ గాథను ఏ మేరకు చారిత్రక సంఘటనగా పరిగణించవచ్చునన్న విషయమై శ్రద్ధ కనబరిచారు''.[1] రామాయణానికి ఏమేరకు పురాతత్వ ఆధారాలున్నాయని అన్వేషిస్తుంటే, ప్రస్తుత రామాయణం కేవలం కట్టుకథ (Fiction)గా కనిపిస్తుందని, కాని దీనిలో ఆది రామాయణానికి సంబంధించిన జాడలు కనిపిస్తున్నాయని భావించారు హెచ్.డి. సంకాలియా.[2] ఆయన దృష్టిలో వాల్మీకి రామాయణానికి, మూల రామాయణానికి (Original-Adi Ramayana) ఏమాత్రం సంబంధం లేదు. పురాతత్వశాస్త్రజ్ఞుడిగా రామాయణ గాథను పరిశోధించి ఆయన కొన్ని నిర్ణయాలకు వచ్చారు. రామాయణంలో పేర్కొనబడిన స్థలాలు, నగరాలకు, అవే పేర్లతో నేడు పిలవబడుతున్న వాటికి, పురాతత్వశాస్త్రం దృష్ట్యా, చారిత్రకంగా ఏమయినా ఆధారాలున్నాయా అనేది ఇంకా లోతుగా పరిశోధించాల్సిన అంశం. అయోధ్య పేరుతో రామాయణ సంస్కృతి ప్రభావం ఉన్న ఆసియా దేశాల్లో కొన్ని నగరాలున్నాయి. ఈమధ్య మరో ఖగోళశాస్త్రజ్ఞుడు రాజేష్ కొచార్ అయోధ్య ఆఫ్ఘనిస్తాన్‌లో ఉందని విస్తృతాధ్యయనంతో, అనేక ఆధారాలతో నిరూపించాడు. కాబట్టి భారతీయ సంస్కృతిపైన, మత గాథలపైన నిజమైన అభిమానం ఉన్నవారు రాముడి జన్మస్థలమిదేనని, రాముడు ఇక్కడే పుట్టాడని మూఢంగా విశ్వసించరు. హిందూత్వవాదులు విశ్వసిస్తున్న ఉత్తరప్రదేశ్‌లోని అయోధ్య, దాని పరిసరప్రాంతాలు ఒక్క హిందువులకే పవిత్రమైనవి కావు. అవి జైనులకు, బౌద్ధులకు అరాధనీయ స్థలాలు. అక్కడ వైదిక, అవైదిక మతాలకు చెందిన చారిత్రక ఆధారాలున్నాయి. మధ్యయుగాలనుండి శైవ, వైష్ణవ మత శాఖలతోపాటు, ముస్లిం మత ప్రభావం అక్కడ కనిపిస్తుంది. అందువల్ల అటువంటి ప్రాచీన నగరాన్ని, ఆ పరిసర ప్రాంతాల్ని భారతీయ సంస్కృతికి, భిన్న మతాలకు నిలయంగా, ప్రాచీన చారిత్రక ప్రదేశాలుగా ప్రభుత్వం ప్రకటించాలి. అయోధ్య, దాని పరిసర ప్రాంతాలు ప్రాచీన కాలం నుండి ఆధునిక యుగం వరకు భారతీయ సంస్కృతికి ఆధారకేంద్రాలు. ఈ ప్రాంతాన్ని రామాయణగాథకే పరిమితం చేసి, సంకుచిత మత దృష్టిని ఏ మతస్థులూ ప్రదర్శించకూడదు.

ఆసక్తికరమైన విషయమేమిటంటే రామకథకు ఏమయినా చారిత్రక ఆధారం ఉన్నదా అని సంకాలియాలాంటి పురాతత్వ శాస్త్రజ్ఞులు త్రవ్వకాలు జరిపి అన్వేషిస్తే, ఆధునిక వేదాంత దార్శనికుడు అరవిందుడు ''రాముడు చారిత్రక వ్యక్తి కాడని, ఆయన జీవించి ఉండవచ్చుని, కాని ఆయన గురించి ఎవరూ నిర్ధారణగా చెప్పలేరని'' తేల్చారు. మేము భారతీయ సంస్కృతి పరిరక్షకులం, హిందూమత పునరుద్ధారకులమని తమను తామే పొగుడుకొనే మతవాదులు అరవిందుడు రామాయణాన్ని గురించి ''సాయంకాల సంభాషణ''[4]ల్లో అన్న మాటల్లోని అంతరార్థాన్ని గుర్తించాలి.

ఈనాడు ఉత్తర భారతదేశంలో రామభక్తి పేరుతో మూఢ మతవిశ్వాసాల్ని హిందూతత్వవాదులు ప్రచారం చేస్తున్నారు. ప్రాచీన ప్రార్థనా మందిరాలనుండి, పాపం పుణ్యం తెలియని బడిపిల్లల పాఠ్యగ్రంథాల

వరకు తప్పుల్ని సరిదిద్దుతాం అనే మతోన్మాద ప్రణాళికతో, కుటిలమైన ఎత్తుగడలతో మతవాదులు విజృంభిస్తుంటే, దక్షిణ భారతదేశం, అందులో ఆంధ్రదేశంలో భగవద్గీతపై, రామాయణంపై పాక్షిక దృష్టితో కాకుండా సమగ్రదృష్టితో, శాస్త్రీయ విశ్లేషణతో కొన్ని రచనలయినా ప్రచురించబడటం ఆహ్వానించదగ్గ పరిణామం.

ఈరోజు ఎవరయినా వాల్మీకి రామాయణాన్ని, అందులోని పాత్రల్ని గురించి మాట్లాడితే వెంటనే రామ జన్మభూమి వివాదం, దానికి కారకులైనవారు గుర్తుకొస్తారు. రామాయణం హిందువుల ఆదికావ్యంగా, అది వారి పవిత్ర గ్రంథాలలో ఒకటిగా నూటికి తొంబయితొమ్మిది మంది హిందువులు విశ్వసిస్తారు. రామాయణ కథ, దీనిలోని పాత్రలు ఆసియా ఖండంలోని అనేక దేశాల్ని, అనేక సంస్కృతుల్ని ప్రభావితం చేశాయి. ఆరుద్ర మాటల్లో చెప్పాలంటే ''రామ కథ ఆసియా ఖండమంతా అలముకొంది. శ్రీలంక, టిబెత్తు, ఖోటాను, కాంబోడియా, మంగోలియా, సైబీరియా, చైనా, జపాను, లావోస్, చంప, థాయ్‌లాండ్, ఇండోనేషియా, మలేషియా, ఫిలిప్పీన్స్, బర్మా దేశాలలో రామాయణ కథను కొన్నిచోట్ల జానపద గాథగా, బహుళ ప్రచారంలోను, కొన్ని చోట్ల సాహిత్యంగా గ్రంథస్తమై ఉన్నాయి. ఈ కథలలో వాల్మీకి రామాయణంలో లేని విషయాలు ఎన్నో ఉన్నాయి.''[5] 1975లో ఢిల్లీలో అంతర్జాతీయ రామాయణ సదస్సు జరిగింది. ఈ సదస్సులో దేశ, విదేశీ పండితులు, పరిశోధకులు వివిధ దేశాలకు, వివిధ సంస్కృతులకు, వివిధ మతాలకు సంబంధించిన రామాయణ గాథలపై పరిశోధనా పత్రాలు సమర్పించారు. ఈ రామాయణ సదస్సులో సమర్పించబడిన పత్రాల్ని ఒక్కసారి పైపైన చూసినా వివిధ రామాయణ గాథలలోని వైవిధ్యాన్ని, విశిష్టతను గుర్తించగలుగుతాము. మలేషియాలోని రామాయణం గురించి ప్రసంగించిన ఇస్మాయిల్ హుసేన్ మలయ్ రామ గాథలపై ఇస్లాం మత ప్రభావం పరిశీలనార్హమన్నారు. మలయ్ రామాయణంలో రావణుడు చివరకు ముస్లిం సన్యాసిగా మారతాడని చెప్పారు. బౌద్ధమత ప్రభావమున్న ఆసియా దేశాల్లో రామ కథ మరోవిధంగా ప్రచారంలో ఉంది. ఇటువంటి రామ గాథను ఏదో ఒక మతానికి పరిమితమయిందిగా భావించి, అందులోని పాత్రలను, స్థలాలను గూర్చి మతపరమైన వివాదాన్ని సృష్టించటం ''అనాగరిక చర్య''గా భావించిక తప్పదు. ప్రసిద్ధ రచయిత, రామభక్తుడైన చల్లా రాధాకృష్ణ శర్మ ఈ రామాయణ సదస్సు గురించి రాసిన వ్యాసంలో ముగింపు మాటలు రాస్తూ ఇలా అంటారు ''దేశాలు వేరయినా మనుషులు ఒకటే. ఎవరి విశ్వాసాలు వారివి. ఎక్కడెక్కడి వారిని కలుపుతున్న రామ కథ నిజానికి ఒక్క భారతదేశానికే పరిమిత మయింది కాదు''.[6] విజ్ఞతతో కూడిన ఆయన మాటలకు మరో రెండు మాటలు చేరిస్తే ఆయన అభిప్రాయం స్పష్టంగా అర్థమవుతుంది. భారతదేశమంటే ఈ దేశంలో ప్రధాన మతమయిన హిందూమతానికే చెందింది కాదు. అది అవైదిక మతాలయిన జైన, బౌద్ధ మతాలకు కూడా చెందింది. మన కేంద్ర సాహిత్య అకాడెమీ వరుసగా 1980, 1983లో ప్రచురించిన రెండు గ్రంథాలు 1. ది రామాయణ ట్రెడిషన్ ఇన్ ఏసియా[7] (ఆసియాలో రామాయణ సంప్రదాయం), 2. ఏసియన్ వేరియేషన్స్ ఇన్ రామాయణా[8] (రామాయణంలో ఆసియా ఖండపు భేదాలు) ల్ని

చదివినా రామాయణ వారసత్వం (Ramayana Heritage) కేవలం అది ఏదో ఒక మతానికి చెందింది కాదని, అది భిన్న దేశాల సంస్కృతుల్ని, మతాల్ని అనేక విధాలుగా ప్రభావితం చేసిందని విశదమవుతుంది.

ప్రసిద్ధ వామపక్షమేధావి కె.ఎన్. ఫణిక్కర్ ''కమ్యూనలిజం ఇన్ ఇండియా''[9] (భారతదేశంలో మతవాదం) గ్రంథంలో భారతీయ పురాణాలు వాటి పుట్టుకలో అవి స్వాభావికంగా, సహజసిద్ధంగా హిందూమతానికి చెందినవేనా అని ప్రశ్నించాడు. నిజంగా భారతీయ సంస్కృతిని అభిమానించేవారు ఆలోచించదగిన ప్రశ్న ఇది. రామాయణ, మహాభారతాలు వాటి స్వభావ రీత్యా హిందూ మతానికి లేదా నాటి వైదిక సంస్కృతికి చెందినవే అయితే ఇన్ని రకాల రామాయణాలు, ఇంత వైవిధ్య పూరిత కథనాలు ఉండేవి కావు. బహుశా రామకథ భారత ఉప ఖండానికి చెందిన ప్రాచీన లౌకిక గాథ కావచ్చు. రామాయణ గాథ భిన్న రూపాల్ని, భేదాల్ని (Variations) చూసినా, అది చారిత్రకంగా, సాంస్కృతికంగా ఎటువంటి పాత్ర నిర్వహించిందీ అర్థమవుతుంది. ప్రొఫెసర్ రొమిలాథాపర్ వాల్మీకి రామాయణం దాని మూల రూపంలో, ఈరోజు పవిత్ర గ్రంథమంటే ఏ అర్థంలో అర్థం చేసుకుంటున్నామో, ఆ అర్థంలో అది పవిత్ర (మత) గ్రంథం కాదని ఆమె అభిప్రాయపడ్డారు.[10] వాల్మీకి రామాయణాన్ని, దీని మూలరూపమైన రామ కథను హిందూత్వ వాదులు ''హైజాక్'' చేశారని భారతీయ సంస్కృతి మూలరూపం తెలిసిన ఆమె అన్నారు. రొమిలా థాపర్ వంటి చరిత్రకారులకు ఏమతంపై గుడ్డి ద్వేషం లేదు, అభిమానం లేదు. వృత్తి ధర్మానికి కట్టుబడిన చరిత్రకారులుగా చరిత్రలోని నిజాల్ని తమ రచనల్లో వెల్లడించారు. 1991లో ఆమె రాసిన ''ఎ హిస్టారికల్ పర్స్పెక్టివ్ ఆన్ ది స్టోరీ ఆఫ్ రామ'' (రామ కథపై చారిత్రక దృష్టిక్రమం) అనే పరిశోధనా వ్యాసాన్ని చదివితే రొమిలాథాపర్ చారిత్రక దృష్టిక్రమం ఎంత ఆరోగ్యకరమైందీ, విశిష్టమైందీ ఎటువంటి వారికయినా అర్థమవుతుంది.

మతపరమైన మూఢ విశ్వాసాల్ని ప్రశ్నించటంలో, మత గ్రంథాల్ని, పుక్కిటి పురాణాల్ని విమర్శించటంలో ఆంధ్రులు ఆధునిక యుగంలో అగ్రస్థానంలోనే ఉన్నారు. ఈ మధ్య ప్రచురించబడిన ''త్రిపురనేని రామాయణం'' (2001)పై నాగార్జున విశ్వవిద్యాలయంలో సాహితీ సదస్సు జరిగింది. ఆ సదస్సులో ప్రసంగించమని గ్రంథ రచయిత త్రిపురనేని వెంకటేశ్వరరావు ఆహ్వానించారు. త్రిపురనేని రామాయణ సదస్సులో ఏ విషయాన్ని గురించి మాట్లాడితే బాగుంటుందని ఆలోచిస్తున్నప్పుడు స్ఫురించిన అంశం - తెలుగు సాహిత్యంలో రామాయణ విమర్శ. తెలుగు సాహిత్యంలో రామాయణ విమర్శ ఎప్పుడు ప్రారంభమయిందో ఖచ్చితంగా చెప్పలేము. కన్నడ భాషలో వీరశైవులు తమ వచనాల్లో రామాయణాన్ని విమర్శించారని చల్లా రాధాకృష్ణ తమ రామాయణ వ్యాసాల్లో రాశారు. వీరశైవ మత ప్రభావం ఆంధ్ర దేశంలో ఉంది. ఆ ఉద్యమ ప్రభావంతో తెలుగు భాషలో వీరశైవ సాహిత్యం సృష్టించబడింది. మధ్య యుగంలోని తెలుగు వీరశైవ సాహిత్యంలో రామకథ విమర్శ ఏమయినా ఉందేమో పరిశోధకులు తేల్చాలి. ఆధునిక యుగంలో తెలుగు సాహిత్యంలో రామాయణ విమర్శకు తొమ్మిది దశాబ్దాల చరిత్ర ఉంది. ఈ విషయంపై తెలుగులో ప్రత్యేకమైన పరిశోధన జరిగినట్లు

కనిపించడం లేదు. తెలుగు సాహిత్యంపై రామకథ ప్రభావం గురించి కొన్ని వ్యాసాలు వెలువడ్డాయి. తెలుగు సాహిత్యంలో రామకథ (1972), తెలుగు సాహిత్యం: రామకథ (1972), తెలుగులో రామాయణాలు (1992) పేర్కొనతగినవి. చల్లా రాధాకృష్ణ శర్మ తమ ''రామాయణ వ్యాసాలు'' గ్రంథంలో సురవరం ప్రతాపరెడ్డి 'రామాయణ విశేషములు' (1957) గ్రంథాన్ని ''చక్కని విమర్శకది నికషోపలం'' అని ప్రశంసించారు. అంతకు మించి తెలుగులో వెలువడిన రామాయణ విమర్శనా సాహిత్యాన్ని గురించి ఆయన చర్చించలేదు. తెలుగులో రామాయణ విమర్శకులు కొందరు ఆర్య-అనార్య (ద్రావిడ) దృష్టితో రామాయణాన్ని పరిశీలించిన మాట వాస్తవం. కాని విమర్శకులందరూ ఆ దృష్టితోనే పరిశీలించలేదు. ఆర్య-అనార్య (ద్రావిడ) దృష్టితో రామాయణాన్ని విమర్శించినవారు కూడా వాల్మీకి రామాయణాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసినవారే. రామాయణ కావ్యంలో వారి పాండిత్యాన్ని శంకించలేము. వారి దృష్టిలో కొంత దోషం ఉండవచ్చు. అంతమాత్రాన అది సంకుచిత దృష్టి అని ఆ విమర్శల్ని తిరస్కరించాల్సిన పనిలేదు. ఆ విమర్శకుల పరిమితుల్ని గుర్తించి, ఆ విమర్శలోని యదార్థ విషయాల్ని స్వీకరించవచ్చు. అందువల్లే చల్లా రాధాకృష్ణశర్మ ''ఆధునిక రామాయణ విమర్శకులు వెలార్చిన భావాలను జాగ్రత్తగా పరిశీలించటం సహృదయుల కర్తవ్యమ''ని భావించారు.

తెలుగులో తొలిసారి రామాయణ విమర్శ చేసినవారు బొబ్బిలి మహారాజా. ఆయన రామాయణ, మహాభారతాలపై 1910లో రెండు చిన్న విమర్శన గ్రంథాలు రచించారు. బొబ్బిలి మహారాజా రామాయణ విమర్శన గ్రంథాన్ని గురించి చెబుతూ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి ఇలా అన్నారు ''అందుకొన్ని యంశములు రెడ్డిగారి గ్రంథాంశమునకు సరిపడియేయున్నవి''.[11] తెలుగులో రామాయణంపై తొలి విమర్శన గ్రంథాన్ని రచించిన బొబ్బిలి మహారాజా గురించి ఇంతకుమించి మనకు తెలియదు. ఈ పీఠికలోనే పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి 1913లో రామాయణాన్ని విమర్శిస్తూ ''రామోపాఖ్యానం-తద్విమర్శనం'' అనే గ్రంథాన్ని రచించినట్టు చెప్పుకున్నారు. ఈ గ్రంథంలోని చర్చనీయాంశాలు అంతకుముందు ''మానవ సేవ'', ''ఆంధ్ర భారతి'', ''ఆంధ్ర సారస్వత పరిషత్పత్రిక''లలో వ్యాసాలుగా రచించినట్టు ఆయనే చెప్పారు.[12]

రామాయణ గాథను చారిత్రకంగా పరిశీలించే ప్రయత్నం మొదట బొబ్బిలి మహారాజాతో ప్రారంభమయిందని చెప్పుకున్నాము. ఇటువంటి విమర్శనాత్మక విశ్లేషణ చేయడానికి ఆయన్ని ఏశక్తులు ప్రేరేపించాయో తెలియదు. కాని నాటినుండి నేటివరకు తెలుగులో రామాయణ విమర్శ ఎవరో ఒకరు కొనసాగిస్తూనే ఉన్నారు. ఆయన తర్వాత రామాయణ, భారతగాథలను చారిత్రక దృష్టితో, సమగ్రంగా పరిశీలించే ప్రయత్నం 1913లో మొదలైంది. ఇటువంటి కృషిలో, పరిశోధనలో మకుటాయ మానమనదగిన రచనలు కీ॥ శే॥ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి (1877-1950) ప్రచురించారు. ఆయన సంస్కృతాంధ్ర భాషాపండితుడు, పరిశోధకుడు. ప్రాచీన సంస్కృత సాహిత్యాన్ని, రామాయణ, మహాభారతాల్ని భక్తి ప్రపత్తులతో కాకుండా, సత్యాన్వేషణా దృష్టితో పరిశీలించి

రామోపాఖ్యానం, మహాభారత చరిత్రం, రాజసూయ రహస్యం వంటి గ్రంథాలు రచించి తెలుగు వారిని చైతన్యపరిచారు.

మన పురాణ పండితులు వాల్మీకి రామాయణం శతకోటి శ్లోక పరిమితమన్నారు. నేడు వాడుకలో ఉన్న 24 వేల శ్లోకాల, ఏడు కాండల వాల్మీకి రామాయణమే మనకు దక్కిందన్నారు. పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి ఈ అభిప్రాయంతో విభేదించారు. మహాభారత కాలంలో వాడుకలో ఉన్న రామాయణం అరణ్యపర్వంలో[13] చేర్చబడిందని, తొలుత వాల్మీకి రచించినది అదియే కావచ్చుని, ఆ తర్వాత కవి పండితుల చేతుల్లో పడి, అది అనేక మార్పులకు, చేర్పులకు గురయి, మహారామాయణంగా రూపొందిందని ఆయన భావించారు. ''రామోపాఖ్యానం- తద్విమర్శనం'' నేడు అలభ్యం. హేతువాద దృష్టి కలిగిన పరిశోధకులెవరయినా దీనిని సంపాదించి, పునర్ముద్రించాల్సిన అవసరమెంతయినా ఉంది.

రామాయణ, మహాభారతాలపై పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి రచనలు సనాతన పండితుల్లో ఆగ్రహాన్ని తెచ్చాయి. అప్పుడేకాదు, ఇప్పుడయినా ఆయన ప్రకటించిన అభిప్రాయాలు కొంతమందిలో తీవ్రమైన ఆగ్రహాన్ని, అసహనాన్ని కలిగించవచ్చు. పాండవులు భారతీయులుకారు, వాళ్ళు విదేశీయులు. టిబెట్ దేశీయులని ఆయన రాశాడు. సర్పయాగమంటే పాములను చంపటం కాదు. నాగజాతి నిర్మూలన అని ఆయన డెబ్బయి సంవత్సరాల క్రితమే సోదాహరణంగా నిరూపించాడు. సనాతనుల నుండి ఆనాడు ఆయన ఎన్నో దూషణల్ని, అవమానాల్ని ఎదుర్కొని నిలబడ్డాడు. శ్రీపాద కృష్ణ మూర్తి శాస్త్రి లాంటివారే ఆయన రచనల్ని ఖండిస్తూ, ప్రతి విమర్శలు రాశారు. ఇద్దరూ ఈ వివాదంలో కోర్టులకు కూడా ఎక్కారు. ఇదంతా ఆయన సత్యాన్వేషణ పట్లగల నిబద్ధతో చేశారు. ఈనాడు కొంతమంది విమర్శకులు ''సత్యాన్వేషణ'' అనే పదబంధాన్నే ఎగతాళిగా చూడవచ్చు. తమకు జ్ఞానోదయ మయినప్పటినుండే, ఈ ప్రపంచం తన జ్ఞాన చక్షువుల్ని తెరుచుకుందని, అంతకు ముందంతా అంధకారంలో, అజ్ఞానంలో ఉన్నారని భ్రమించే కొంతమంది విమర్శక చక్రవర్తులకు తాము చేసేదే సత్యాన్వేషణ, ఇతరులు చేసేది అసత్యాన్వేషణగా కనిపిస్తుంది. ఈనాటి అత్యాధునిక దృష్టికోణం ఆనాటి వారికి లేకపోవచ్చు. ఈనాటి వారికి స్ఫురించిన ఆలోచనలు, భావాలు ఆ తరం వారికి కలగకపోవచ్చు. గత తరం పరిశోధకుల, రచయితల, విమర్శకుల అభిప్రాయాల్ని వినమ్రతతో అధ్యయనం చేసి, స్వీకరించాల్సిన విషయాల్ని స్వీకరించి, త్యజించాల్సిన వాటిని త్యజించి అత్యాధునిక విమర్శకులు ముందుకు సాగాలి. అంతేకాని నాకు, నామిత్రుడికి కలిగిన ''జ్ఞానోదయం'' గతంలో సుబ్రహ్మణ్యశాస్త్రి నుంచి నార్ల వరకు ఎవరికీ ఎందుకు కలగలేదంటే ఎవరూ సమాధానం చెప్పలేరు. కాని వీరేదో ''ఇన్ ఫ్యాంటైల్ డిజార్డర్''కు లోనయ్యారని ఆలోచనాపరులు అనుమానించవచ్చు.

పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి నిర్భయమైన పరిశోధనా దృష్టిని ప్రముఖులైన ప్రాచ్య, పాశ్చాత్య పండితులు కొనియాడారు. ప్రొఫెసర్ కీత్ (ఎడింబరో), డా॥ఎస్. రాధాకృష్ణన్, డా॥ హెబ్బేంకర్ (పూనా), కట్టమంచి రామలింగా రెడ్డి ఆయన గ్రంథాలపై చెలరేగిన వాద, వివాదాల్లో ఆయన్ని సమర్థించారు.

సి.ఆర్.రెడ్డి పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిని as an independent and fearless critic and researcher (స్వతంత్రమైన, నిర్భయమైన విమర్శకుడిగా, పరిశోధకుడి)గా ప్రశంసించాడు.

తెలుగులో రామాయణంపై వివరంగా, విపులంగా వెలువడిన విమర్శనాత్మక గ్రంథాలలో సురవరం ప్రతాపరెడ్డి (1896-1953) రామాయణ విశేషములు తొలిగ్రంథంగా చెప్పుకోవచ్చు. వాల్మీకి రామాయణాన్ని తన జ్ఞాన తృష్ణలో భాగంగా అధ్యయనం చేసిన సురవరం ప్రతాపరెడ్డికి జన రామాయణాలకు భిన్నంగా వాల్మీకి రామాయణంలో కొన్ని విశేషాలు కనిపించాయి. ఈ విశేషాల్ని చిదిరె వీరభద్ర శర్మ సంపాదకత్వంలో వెలువడుతున్న ''విభూతి'' అను పత్రికలో 1938 సంవత్సరము నుండి ఒక సంవత్సరం పాటు సీరియల్‌గా ప్రకటించారు. ఈ పరిశోధనా వ్యాసాల్ని సంస్కరించి 1943లో పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి పీఠికతో ''రామాయణ విశేషములు''గా ప్రథమ ముద్రణ పొందింది.

రామాయణం గురించి రెండు రకాలైన విమర్శ(న) పద్ధతులున్నాయని గ్రంథ ప్రారంభంలోనే సురవరం ప్రతాపరెడ్డి చెప్పారు. అవి : 1. ఆధ్యాత్మిక విమర్శ, 2. చారిత్రక విమర్శ. ఈ రెండు విమర్శన పద్ధతుల గురించి ఆయన ఇలా వివరించారు ''రామాయణమును గురించి యాధ్యాత్మిక పరముగాను, చారిత్రకముగాను రెండు విధములగు విమర్శన పద్ధతులు కనబడుచున్నవి. ఆధ్యాత్మికముగా పరిశీలించు మొదటి వర్గము రాముడు అవతార పురుషుడు, పురుషోత్తముడు. అతనిలో ఏ లోపమూ లేదు. అతడు సాక్షాద్విష్ణు భగవానుడే. రెండవ వర్గమువారు శ్రీరామచంద్రుని ఆదర్శ మహాపురుషుడిగా స్వీకరించుచున్నారు. కేవలము చారిత్రక దృష్టితోనే విమర్శించుచున్నారు''.

రామాయణ విశేషాల్లో సురవరం ప్రతాపరెడ్డి చారిత్రక విమర్శనే అనుసరించారు. ఈ విమర్శ ఛాందస పండితులకు రుచించలేదు. ''విభూతి'' పత్రికా సంపాదకులు చిదిరె మఠము వీరభద్ర శర్మ శైవ మతాభిమానులు కావడంవల్ల వైష్ణవ గ్రంథమైన రామాయణంపై విమర్శ రాయించారని ఆనాడు రామభక్తులు కొందరు భావించారు. నిజానికి సురవరం వైష్ణవ మతానుయాయి. ఆయనకు ఈ శాఖా భేదాలు తెలియవు. ''శ్రీమద్రామాయణంపై నాకు అద్వితీయ ప్రేమ భక్తి కలదని'' ఆయన గ్రంథాంతంలో ప్రత్యేకంగా చెప్పుకున్నారు. అయినా ఆయన వాల్మీకి రామాయణాన్ని భక్తునివలె, హరిదాసులవలె పారాయణం చేయకుండా, చారిత్రక దృష్టితో హేతువాదిగా, విమర్శనాత్మకంగా విశ్లేషించారు. రామాయణ విశేషాల్లో ప్రకటింపబడిన అనేక అంశాలు నాడే కాదు నేడు కూడా ఆశ్చర్యకరంగా కనిపిస్తాయి. రామాయణాన్ని గురించి పౌరాణికులు, హరిదాసులు ప్రచారం చేసిన కట్టుకథలకు అలవాటు పడిన ప్రజలకు సురవరం ప్రతాపరెడ్డి వాల్మీకమే అవాల్మీకంగా కనిపించవచ్చు. అంతగా అవాల్మీకమైన కథలు వాల్మీకి రామాయణంగా ప్రసిద్ధి చెందాయి.

వాల్మీకి పుట్టుకచేత బోయకాడని, భృగు వంశజుడని, ఆయన ఇరాన్ దేశీయుడని సుదీర్ఘ చర్చానంతరం సురవరం ప్రతాపరెడ్డి నిరూపించారు. రామ రాజ్యమంటే అదొక ఆదర్శరాజ్యంగా, భూతల స్వర్గంగా ప్రచారమయింది. ఈ అభిప్రాయం తప్పని, శ్రీరాముని కాలంలో కూడా ధర్మం

నాలుగు పాదాలపై నడవలేదని తేల్చారు. రామాయణ కాలంలో అగ్రవర్ణస్థులైన బ్రాహ్మణులు, క్షత్రియులు మాంసాహారులేనని ఆయన సప్రమాణకంగా రుజువు చేశారు. కండు మహర్షి, భరద్వాజ మహర్షి, అగస్త్య మహాముని మాంసాహారాన్ని తినేవారని వాల్మీకి రామాయణంలో ఉంది. మాంస భోజనం గురించి సురవరం మాటల్లోనే చూద్దాం: ''గోమాంసంను తినుట రామాయణమందు అరుదుగా కనిపించినను ఇతర జంతు మాంస భుక్తి బాగా కనబడుచున్నది.'' రామాయణ కాలంలో సర్వ వర్ణాలు మాంసాహారాన్ని ''పవిత్రమైనదిగా, రుచ్యమైనదిగా భావించి'' తినేవారని వెల్లడించారు. ఈ మధ్య మనదేశంలో చరిత్ర పాఠ్య పుస్తకాల నుండి కొన్ని అభ్యంతరకరమైన భాగాల్ని తొలగించాలని బి. జె. పి. ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాల్లో ముఖ్యమైంది ప్రాచీనకాలంలో ఆర్యులు మాంసాహారులని, వీరు గోమాంసం, గొడ్డు మాంసం తినేవారని రాసిన భాగాలే! తర్వాతికాలంలో బ్రాహ్మణులు ఈ మాంసాహారాన్ని తినరాదంటూ నిషేధించారని కూడా ''ప్రాచీన భారతదేశం''.[14] (6వ తరగతి, పాఠ్యపుస్తకం) పాఠ్య పుస్తక రచయిత రొమిలా థాపర్ రాశారు. ప్రాచీన కాలంలో వైదికార్యులు మాంస భక్షణ చేసేవారని రాసిన భాగమే వీరికి పెద్ద అభ్యంతరకరమైంది. చరిత్రలోని కొన్ని నిజాలు మనకు నచ్చకపోతే చరిత్రనే రద్దు చేయాలా[15] (వార్త, 11, డిసెంబరు, 2001) అని ఆమె ఆవేదనతో ప్రశ్నిస్తున్నారు. ఇప్పుడు బి. జె. పి. ప్రభుత్వం అభ్యంతరకరమైన భాగాలంటూ తొలగించిన వాటికి చారిత్రక ఆధారాలున్నాయి. ఆర్యులేకాదు, అవతారపురుషుడిగా భావించబడే రాముడే మాంసాహారాన్ని తినేవాడని సురవరం ప్రతాపరెడ్డి 1938 సంవత్సరంలోనే రాశాడు. దశాబ్దాలుగా ఆయన గ్రంథాన్ని గొప్ప పరిశోధనగా భావించి అందరూ చదువుతున్నారు. ఏ రామభక్తుడు ఈ అంశాన్ని ప్రశ్నించే సాహసం చేయలేదు. రామాయణం పై తనకు అద్వితీయమైన భక్తి కలదని చెప్పిన ఆయన ఇటువంటి యదార్థ విషయాలు చెప్పడానికి సంకోచించలేదు. నిజమైన ఆధ్యాత్మిక వాదులంటే సురవరం ప్రతాపరెడ్డి లాంటి వారవుతారు కాని మత పరమైన పక్షపాతంగల ప్రొఫెసర్ మురళీ మనోహర్ జోషి కాదు.

ప్రాచీన భారతదేశంలో గోమాంస భక్షణ అనే విషయంపై చర్చ ఈనాటిది కాదు. పందొమ్మిదివ శతాబ్దం ద్వితీయార్థంలో భారతీయ విషయ పరిశోధకుల్లో అగ్రగణ్యుడైన రాజేంద్రలాల్ మిత్ర ''ప్రాచీన భారతదేశంలో గోమాంస భక్షణ'' (Beef in Ancient India)[16] అనే వ్యాసంలో ప్రాచీన సంస్కృత గ్రంథాల నుండి మాంస భక్షణకు సంబంధించి అనేక ఉల్లేఖనలు ఇచ్చాడు. గోమాంసం తినే జాతి గోపూజ చేసే జాతిగా ఎలా మారిందో ఆలోచిస్తుంటే విచిత్రంగా ఉంటుంది. ఆచార, సాంప్రదాయాల్ని ఈనాటి మన విశ్వాసాలతో అర్థం చేసుకోవాలని ప్రయత్నిస్తే పొరపాటు చేసినట్లే. ఏ సాంఘికాచారం ఈ రోజున్నట్లే గత చరిత్రలో లేదు. సామాజిక పరిణామంలో భాగంగా అన్ని విలువలు, ఆచారాలు మారుతుంటాయి. ఏ సమాజంలోనయినా మార్పే శాశ్వతం. ఎంత గొప్ప పండితుడికయినా, ప్రొఫెసర్‌కయినా చారిత్రక దృష్టి లేకపోతే ఇటువంటి విషయాల్లో అల్లరిపాలవుతాడు. తమ నమ్మకాల్ని, విశ్వాసాల్ని చరిత్ర పాఠాలుగా రుద్దాలనే ప్రయత్నం అనాగరిక చర్య. ఈదేశ చరిత్ర అటువంటి ప్రయత్నాల్ని జీర్ణం చేసుకోలేదని మతవాదులు ఎంత త్వరగా గుర్తిస్తే అంత మంచిది. ఇరవయ్యో శతాబ్ది సంస్కృత పండితుల్లో మహా మహోపాధ్యాయ పి. వి. కానె గురించి ప్రత్యేకంగా

చెప్పాల్సిన అవసరం లేదు. సంస్కృత భాషా సాహిత్యాలలో జగమెరిగిన మహా పండితుడు. అద్భుతమయిన ఆయన సంస్కృత భాషా పరిజ్ఞానానికి తార్కాణం - ధర్మశాస్త్ర చరిత్ర (History of Dharmasastra) అనే గ్రంథం. దీనిలో ప్రాచీన భారతంలో మాంసాహారానికి సంబంధించిన సాక్ష్యాలు కావల్సినన్ని ఉన్నాయి. సురవరం ప్రతాపరెడ్డి, రాజేంద్రలాల్ మిత్ర, పి.వి. కానె లాంటి పండితులు వైదిక మత వ్యతిరేకులు కారు. వీరు మతాన్ని, మత విశ్వాసాల్ని చారిత్రక దృష్టితో చూశారు కాబట్టి తమ వ్యక్తిగత విశ్వాసాలకు విరుద్ధమయినా చరిత్రలోని నిజాల్ని తొలిగించకుండా యథాతథంగా ప్రకటించారు.

సురవరం ప్రతాపరెడ్డి రామాయణ విశేషాల్లో నేటికీ ఎంతో ప్రాధాన్యత ఉన్న అధ్యాయం ''వివిధ రామాయణ కథలు''. తెలుగులో రామాయణంపై విమర్శనాత్మక రచనలు చేసిన పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి, సురవరం ప్రతాపరెడ్డిలు నాస్తికులో, భౌతికవాదులో కారు. వీరు ఆర్ష ధర్మాభిమానులు. పరమతద్వేషం, స్వమత దురభిమానం లేని సత్యాన్వేషణా దృక్పథాలు వీరివి. తమకు యదార్థమని తోచిన విషయాల్ని నిర్భయంగా ప్రకటించడానికి వెనుదీయని ధీరులు. ఇటువంటి సత్యనిష్ఠగల పండితులు ఏ మతానికయినా మార్గదర్శకులుగా చెప్పుకోవాలి. ప్రతాపరెడ్డిలో భక్తి కంటె జ్ఞానానికి అగ్రస్థానం ఉంది.

దాదాపు ఐదు దశాబ్దాల క్రితం సురవరం ప్రతాపరెడ్డి అవైదిక రామాయణాల్లో, ముఖ్యంగా జైన రామాయణంలో విశ్వసనీయ విషయాలనేకం ఉన్నాయని చెబుతూ అన్న మాటలు ఆయన నిష్పాక్షిక పరిశోధనకు మచ్చు తునకలు. ''మన మతమునకు విరుద్ధములయిన బౌద్ధ జైన చార్వాక లోకాయత సిద్ధాంతములను మనము పాషండ మతముల పట్టీలో జేర్చి తదనుయాయులను నాస్తికులనియు, వేద విరుద్ధులనియు, వేద బాహ్యులనియు నిందించి యుపేక్షాభావమును చూపినారము. అట్లుకాక వారి వాఙ్మయమును వారి జాతక కథలను గూడా చదువవలెను''. ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే పాళీ భాషా పండితుడిగా, ఉదారవాదిగా ప్రసిద్ధుడైన తిరుమల రామచంద్ర బౌద్ధులు, జైనులు వాల్మీకి రామాయణాన్ని అమూలకంగా మార్చారని, ఈ దేశ ప్రజల్ని వంచితుల్ని చేశారని విమర్శించారు.[17] ఇది చాలా దారుణమయిన విమర్శ. తిరుమల రామచంద్రలాంటి పండితుడికి సామాజిక మానవశాస్త్రంలో ఏమాత్రం పరిచయం లేకపోవటం వల్ల బౌద్ధ జాతక కథలను, జైన రామాయణాల్ని అపార్థం చేసుకొని అలా అన్నారు. ఋగ్వేదం దశమ మండలంలో యమ- యమి సంవాదముంది. ఈ సంవాదాన్ని తిరుమల రామచంద్ర ఎలా అర్థం చేసుకున్నారో తెలియదు. కాని బౌద్ధ జాతక కథలలోని వావి వరసలు ఆయనకు తప్పుగా కనిపించి, వైదిక మతాన్ని ''అపహాస్యం'' చేయడానికి బౌద్ధులు, జైనులు ఇటువంటి విడ్డూరాలు సృష్టించారని ఆయన అపోహపడ్డారు. చారిత్రక దృష్టితోపాటు, సోషల్ యాంత్రపాలజితో పరిచయముంటేనే ఇటువంటి అతి ప్రాచీనగాథల్ని, ఆనాటి వావి వరసల్ని అర్థం చేసుకోగలం. మన ప్రాచీనుల ఆచారాల్ని జైనులు, బౌద్ధులు సత్య నిరతితో గ్రంథస్థం చేశారు. అందుకే ప్రతాపరెడ్డి జైన, బౌద్ధ రామాయణ గాథల్లోని విశ్వసనీయత గురించి రాశారు.

(ఇంకా ఉంది)

# అమెరికా సాహిత్య భీతి

## (1930వ సం॥ నోబెల్ సాహితీ పురస్కారోపన్యాసము)

మూలము : సింక్లియర్ లూయిస్ అనువాదము : డా॥ యు.ఏ. నరసింహమూర్తి

(గత సంచిక తరువాయి)

అందులో థియోడార్ డ్రైజర్, హెన్రీమెంకెన్ లేరు. ఇంకా యువకుడైన నాటక విమర్శ శాఖకు తిరుగులేని అధిపతిగా గుర్తింపులేని మా అత్యంత విశద విమర్శకుడు జార్జి జీన్ నాథన్ లేడు. మా నాటక కర్తలలో సాటి పోటీలేని యూజీన్ ఓ నెయిల్ లేడు. ఎడ్నా సెయింట్ విన్సెంట్ మిల్లె, కార్ల్‌శాండ్ బర్గ్, రాబిన్‌సన్ జఫర్స్, వాఛెల్‌లింద్సే మౌలిక ప్రజ్ఞకల, అసలైన కవులు లేరు. Spoon River Anthology ఇంతవరకు ప్రచురితమైన కవిత్వమంతటి కంటె విలక్షణమైనది, తాజాతనం నిండినది, అధికారిక ప్రవృత్తి కలది. తడుములాట నుండి, పిరికితనాల నుండి విముక్తిని సాధించింది. అది ఒక రహస్య గుహాద్వారం విచ్చుకున్నట్లుగా వచ్చి సహజసిద్ధమైన అమెరికా కవిత్వ సంప్రదాయాన్ని సృష్టించింది. దానిని రచించిన కవి ఎడ్గార్ లీ మాస్టర్స్ ఈ అకాడమీలో లేడు. విల్లా కేథర్, జోసెఫ్ హెర్గ్‌షీమర్, షేర్‌వుడ్ ఆండర్సన్, రింగ్ లార్డనర్, ఎర్నెస్ట్ హెమ్మింగ్వే, లూయీ బ్రోమ్‌ఫీల్డ్, విల్బర్ డేనియల్‌స్టీలె, ఫన్నీహర్స్ట్, మేరీ ఆస్టిన్, జేమ్స్‌బ్రాంచ్ కేబెల్, ఎడ్నాఫెర్బర్ వంటి నవలాకారులు, కథకులు అందులో లేరు. అప్టాన్ సింక్లియర్ తీవ్రత నిండిన సామ్యవాదాన్ని మీరు పొగడినా తెగడినా అమెరికాలోని నవలాకారులు, కవులు, చిత్రకారులు, శిల్పులు, సంగీత విద్వాంసులు, వాస్తుశిల్పులు - అందరికంటే ప్రపంచంలో పేరు ప్రఖ్యాతులు పొందినవాడు. ఆయనా ఈ అకాడమీలో లేడు.

ఈ రచయితలందరూ ఉండే అకాడమీ పట్టే అదృష్టాన్ని ఇంకొక అకాడమీ విషయంలో నేను ఊహించుకోలేను. వీళ్లలో ఏ ఒక్కరు లేక పోయినా అది సమకాలీనము శక్తివంతము మౌలికము అయిన అమెరికా సాహిత్యంలో సంబంధాలు తెంచుకున్నదవుతుంది. మన జీవితంతోను, వాంఛలతోను సంబంధంలేని దవుతుంది. అది సమకాలీన అమెరికా సాహిత్యానికి ప్రతినిధి కాలేదు. హెన్రీ వడ్సువర్త్ లాంగ్‌ఫెలోకి మాత్రమే ప్రాతినిధ్యం వహిస్తుంది.

అకాడమీ ఏభైమందిని మాత్రమే సభ్యులుగా చేర్చుకోగలదు, ప్రతిభగల ప్రతివారికీ అందులో స్థానం కల్పించలేదని సమాధానం చెప్పవచ్చును. కాని వాస్తవం ఇంకోలా ఉంది. మనకున్న మహత్తర ప్రజ్ఞావంతులు కొందరిలో ఎక్కువమందికి అకాడమీలో స్థానం లేదు. కవులని చెప్పుకోడానికి సిగ్గుపడదగ్గ ముగ్గురు కుకవులకు మాత్రం అకాడమీలో స్థానం లభించింది. ఊరూపేరూలేని ఇద్దరు మెలోడ్రామా రచయితలకు చోటు దొరికింది. విశ్వవిద్యాలయాధ్యక్షులుగా మాత్రమే జనానికి తెలిసిన ఇద్దరు పెద్దమనుషులున్నారు. ముప్పై ఏళ్లక్రితం తెలివిగా, చమత్కారంగా చట్టపరమైన పత్రాలు రాసేవాడిగా పరిచయం పొందిన వ్యక్తి ఒకరున్నారు. ఇంకా చాలామంది పెద్ద మనుషులున్నారు. ఎప్పుడూ వారి పేర్లు వినని నా అజ్ఞానానికి ఎంతో విచారిస్తూ పశ్చాత్తాప పడుతున్నాను.

---

డా॥ యు. ఏ. నరసింహమూర్తి, విజయనగరం, మహారాజా కళాశాలలో
తెలుగు శాఖాధ్యక్షులుగా పని చేస్తున్నారు.

నేనో విషయాన్నిక్కడ నొక్కి చెప్పాలి, ఇది నిజం. నేను అమెరికా అకాడమీ మీద దాడి చేయడంలేదు. అది అతిథి మర్యాదలు ఔదార్యం హుందాతనం కల సంస్థ. అమెరికా సాహిత్యకారులుగా ప్రసిద్ధి పొందిన చాలామంది రచయితలందులో లేక పోవడం ఎంతమాత్రమూ ఆ అకాడమీ తప్పు కానే కాదు. కొన్ని సందర్భాలలో అది ఆ రచయితల తప్పే అవుతుంది. భయంగొలిపే ఎలుగ్గొడ్డు లాంటి థియోడార్ డ్రైజర్ ప్రశాంతమైన, విలాసవంతమైన అకాడమీ విందులో సుఖాసీనుడు కావడాన్ని నేను ఊహించుకోలేక పోతున్నాను. మెంకెన్‌ను ఆహ్వానించి ఉంటే అతడు పేట్రేగి పోయిన మొరటు నవ్వులతో వాళ్లని క్రోధవివశులను చేస్తాడు. నేను అకాడమీ పై దాడి చేయడం లేదు. వాస్తవికత అసలైన ప్రధాన ప్రమాణాలు కల అమెరికా భౌతిక జీవితం నుండి విడాకులు పుచ్చుకోవడంతో అది నికార్సైన ఉదాహరణగా నిలిచింది కనుక, దానిపట్ల విముఖంగా ఉంటున్నాను.

మా విశ్వవిద్యాలయాలు, కళాశాలలు, వ్యాయామశాలలు ఇదే దురదృష్టకరమైన సంబంధ రాహిత్యాన్ని ప్రదర్శిస్తున్నాయి. అందులో ఫ్లోరిడాలోని రోలిన్స్ కాలేజి, వెర్మాంట్‌లోని మిడిల్ బరీ కాలేజి, మిచిగన్ విశ్వవిద్యాలయము, చికాగో విశ్వవిద్యాలయము - అనే నాల్గింటిని గూర్చి ఆలోచించగలను. అద్భుత నవలాకారుడు రాబర్ట్ హెర్రిక్ చికాగో విశ్వవిద్యాలయం విద్యార్థి. రాబర్ట్ మార్స్ లోవెట్ ఖలేజా ఉన్న విమర్శకుడు. సమకాలీన సృజనాత్మక సాహిత్యం మీద నిజమైన శ్రద్ధను చూపిన సంస్థలవి. ఈ నాలుగే వాటిలో ఉన్నవి. విశ్వవిద్యాలయాలు, కళాశాలలు, సంగీతశాలలు, ఆధ్యాత్మికపాఠశాలలు, పైపులు బిగించడం, ప్రకటనలు రాయడం నేర్పే సంస్థలు అమెరికాలో మోటార్ల కంటె ఎక్కువ రద్దీగా ఉన్నాయివి. ఎక్కడైనా బలిష్ఠమైన ఇండియానా కాంక్రీటుతో నిర్మించినగాథిక్ భవనాన్ని చూసినట్లైతే ఖచ్చితంగా అది ఇంకొక విశ్వవిద్యాలయమని మీరు గ్రహించవచ్చును. అక్కడ రెండు వందలమంది నుండి రెండు వేలమంది దాకా విద్యార్థులుంటారు. విద్యావంతులుగా తయారుకాగల ప్రమాదాన్ని తప్పించుకోవడంలో వారందరూ సమానమైన శ్రద్ధ కలవారు. వాళ్లకు కావలసింది సాంఘిక ప్రతిష్ఠ. బి.ఏ. డిగ్రీ.

సామాజికంగా మన విశ్వవిద్యాలయాలన్నీ పౌరులలోని సామాన్య ప్రజాసందోహానికి సన్నిహితంగా ఉంటున్నాయి. శారీరక వ్యాయామ క్రీడల విషయంలో కూడా అవి అలాగే ఉన్నాయి. కళాశాలల్లో జరిగే గొప్ప ఫుట్‌బాల్ ఆటకు ప్రతివాడూ ఐదు డాలర్ల టిక్కెట్టు కొనుక్కుని, పదిమైళ్ల నుండి వెయ్యి మైళ్ల దూరంలో ఎక్కడ జరిగినా, కౌతుక భరితంగా ఇరవై ఇద్దరు ఆడే ఆటను చూడడానికి ఎనభైవేలమంది దాకా వచ్చేవారు. ఫుట్‌బాల్ ఆడే ఋతువులో సమర్థుడైన క్రీడాకారుడు హెన్రీఫోర్డు, ప్రెసిడెంట్ హూవర్; కల్నల్ లిండ్‌బెర్గ్ వంటి మహోన్నత ఆరాధ్యనాయకుల స్థాయికి సన్నిహితంగా ఎదిగిపోయేవాడు.

విజ్ఞానశాస్త్ర విభాగంలో మనను పాలించే వ్యాపార దేవతలు సరస్వతీ భక్తులకు ఉద్వాసన పలుకుతున్నారు. కవిత్వమన్నా, చిత్రకారుని దృశ్య చిత్రాలన్నా ముఖం ముడుచుకుని నొసలు చిట్లించే మా ఆభిజాత్య వ్యాపార వర్గంలో ఒకరు మిలికాన్, మైకేల్సన్, బాంటింగ్, థియోబాల్డ్ స్మిత్ వంటి వారిని భరించడానికి హుందాగా సమ్మతిస్తారు.

ఇక్కడొక విరోధాభాస ఉంది. సామాజికంగా, శారీరక దార్ఢ్యం దృష్ట్యా, వైజ్ఞానికంగా మా విశ్వవిద్యాలయాలు మాకెంత సన్నిహితంగా ఉన్నాయో, కళల విషయాలలో వాస్తవికతకు సజీవ

సృష్టికి అంత దూరంగా ఉంటూ తమచుట్టూ ప్రహరీలు నిర్మించుకున్నాయి. అమెరికా విశ్వవిద్యాలయాలలోని నియమబద్ధుడై రాజీపడని సాహిత్యాచార్యునికి సాహిత్యం అంటే విధిలేక చతికిల్లాపడి కలం పట్టుకునే ఈనాటి సాధారణ మానవ ప్రాణి కాదు. కాదు అదంతా గతించి పోయింది. కనీసం టైపు మిషన్ కనిపెట్టడానికి వందేళ్ల కిందట చనిపోయిన, ఇంద్రజాలికశక్తితో సృష్టి చేసే అతి మానుషశక్తులనే వాళ్లు కళాకారులుగా అంగీకరిస్తారు. విశ్వవిద్యాలయాల్లో నివసించే ఏ వృద్ధ అనుభవజ్ఞుడికీ సాధారణ మానవ ప్రాణి సాహిత్య సృష్టి చేయగలడనే ఆలోచన రాగానే బుర్ర వెనక్కి తంతూ ఉంటుంది. రచయిత కూడా ఒక కారుడ్రైవరు లాగా, రైతు లాగా మామూలు బట్టలు వేసుకుని అందరితో పాటు మామూలుగా రోడ్లమీద తిరుగగలుగుతాడని వాళ్లు ఒకంతట అంగీకరించ లేరు. నిస్సందిగ్ధంగా, చల్లగా, కల్తీలేకుండా - మరణించి ఉండేదే మా అమెరికా ఆచార్యుల దృష్టిలో సాహిత్యంగా అంగీకరింపబడుతుంది.

అమెరికా విశ్వవిద్యాలయాలు ఈ విషయంలో ఒంటరిగా ఉన్నాయనుకోను. ఆక్స్‌ఫర్డు, కేంబ్రిడ్జిలలోని వృద్ధాచార్యులుకూడా ఇంతే. హెచ్.జి.వెల్స్, బెనెట్, గాల్స్‌వర్ధీ, జార్జిమూర్‌గాని ఇంకా జీవించి ఉండడమనే అనౌచిత్యానికిగాని పాల్పడి ఉంటే శామ్యూల్ జ్యాన్‌లాగా మరణించిన ఎవరితోనో ఒకరితో అందంగా, భద్రంగా వారు సరిపోల్చబడి ఉండేవారని నేనంటే అది కొంచెం అసహ్యంగా కనిపించవచ్చును. స్వీడన్, జర్మనీ, ఫ్రాన్స్‌లలోని విశ్వవిద్యాలయాలలో ఎందరో ఆచార్యులు అవగాహన కంటె విశ్లేషణకు ప్రాధాన్యమిస్తారని నేననుకుంటాను. కాని నవ్యత శక్తి ప్రయోగము నిండిన అమెరికావంటి దేశంలో పాత ఐరోపా సాంప్రదాయిక ఛాయలలో కాక, సాహిత్యాచార్యులు మత ఛాందసత్వాన్ని తగ్గించుకుని, మానవతా విలువల్ని పెంచుకుంటూ పోవాలని ప్రతివాడూ ఎదురు చూస్తాడు. కాని వాళ్లు అలా లేరు.

ఇటీవలి కాలంలో అమెరికా విశ్వవిద్యాలయాల్లో ''నవ్య మానవతావాదము'' అనే కొత్తరకం సర్కసు దర్శనమిచ్చింది. ఇప్పుడు ''మానవతావాదం''లో ఎన్నో విషయాలుంటాయి, అసలు విషయం తప్ప. గ్రీకు, లాటిను భాషలు సామాన్యరైతాంగపు వాడుక భాషకంటె అత్యంతోత్తేజకరంగా ఉంటాయనే నమ్మకం నుండి కంటె మరణించిన గ్రీకు భాషకంటె జీవం నిండిన ఏ గ్రామీణ రైతు అయినా అత్యంతాసక్తికరంగా ఉంటాడనే విశ్వాసం నుండి మనం ఎంతైనా అర్థాన్ని లాగవచ్చును. కాని మసకబారిన సంస్కృతికి ప్రాతినిధ్యం వహించడానికి మసకబారిన మాటనే ఎన్నుకోవాలన్న తీర్పు ఎంతో సున్నితమైనది.

నేటి ప్రపంచం చాలా ఉత్తేజకరంగా, ఆశావహంగా ఉంది. జ్యోష్న, చైనా నారి విప్లవాలతో, వ్యవసాయం - నౌకా నిర్మాణాలలో పారిశ్రామికీకరణను చేపట్టిన బోల్షివిక్కులతో, గొప్ప లోవలు, యువక శిశువులు, భయంకరమైన ఆకలి, శాస్త్రజ్ఞులు చేసే ఒంటరి దైవాన్వేషణ, వంటి విషయాలతో జీవిత మిప్పుడు ధగద్ధగితంగా ఉంది. నవ్య మానవతావాదుల ఈ శీతలాభినివేశాలను అనుగమించడానికి ఏ సృజనాత్మక రచయితకూ సమయం చిక్కడం లేదు. ఈ అధునాతన వర్గం మానవ ప్రకృతిలోని ద్వంద్వప్రవృత్తిని పునరుద్ఘాటిస్తున్నాయి. ఇంతవరకు నేనర్థం చేసుకోగలిగిన విషయమిది.

ఇప్పుడంతా వింతగా ఉంది. దేవుడైనా దయ్యమైనా గ్రీకుల కాలంనాటి ఉడుపులనే దాచుకుంటారు గాని ఆధునిక వస్త్రాలు ధరించరు. నవ్యమానవతావాదులకు ఈడిపస్ విషాదాత్మక నాయకుడు.

ఉద్ధృత స్థాయి అమ్మకందారులతో నిండిన ప్రపంచంలో, డైనమోల ప్రమాదం పొంచి ఉండగా, మనిషి తనను తాను దైవ సంకేతంగా మలుచుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు. అతడు మనిషి కాదు. ఆత్మ సంయమనాన్ని పెంచుకోవడమే జీవనలక్ష్యమనే చిన్న సదుపాయాన్ని వాళ్ళు లోకానికి చూపిస్తున్నారు. ఈ ఆత్మ సంయమనం ఎప్పటికైనా ఏమైనా ఒరగబెడుతుందా లేదా అన్న సంగతి అలా ఉంచండి. ఫలితార్థమేమంటే - జీవితంలో గాని సాహిత్యంలోగాని ఈ ఉద్యమం కొత్తగా సాధించినదేమీ లేదు. జీవితం - కళ పరిత్యాగదశకు, ప్రతికూల దిశకు చేరుకోవడం తప్ప కొత్త ఏమీ లేదు. ఈ సిద్ధాంతం విప్లవ భావాలతో ఉత్తేజితమైన ప్రపంచంలో ప్రవేశపెట్టబడిన తామస తిరోగమన వాదం తప్ప ఇంకొకటి కాదు.

ఆశ్చర్యమేమంటే - ఈ మరణ సిద్ధాంతం, జీవన సంకీర్ణత నుండి - ప్రమాదాల నుండి శూన్యతనిండిన దేవళాలలోకి పలాయనం చిత్తగించే ఈ ధోరణి ధైర్యము - బౌద్ధిక సాహసికత నిండిన దేశంగా అందరూ ఎదురు చూసే ప్రాంతంలోని ఆచార్యులలో విస్తృత ప్రచారాన్ని ప్రభావాన్ని సాధించింది. సృజనాత్మక రచయితలు విశ్వవిద్యాలయాల నుండి ఏర్పరుచుకోదగిన మృదు ప్రభావాలకు ఎన్నడూ లేనంతగా తలుపులు మూసింది.

ఈ కథ ఇప్పటది కాదు. ఎప్పుడూ ఇంతే, అమెరికాలో ఏ కాలంలోనూ ఒక బ్రాండె, ఒక టైనె, ఒక గొథె, ఒక క్రోచె లేరు.

సృజనాత్మక ప్రతిభలో సంపన్నమైన అమెరికాలో సాహిత్య విమర్శ మందకొడిగా, గుర్తింపు లేనిదిగా కొనసాగింది. అసూయాగ్రస్తులైన అవివాహితలు, మాజీ బేస్‌బాల్ విలేఖరులు, వ్యంగ్యం నిండిన ఆచార్యులు అక్కడ విమర్శకులు. బడిపంతులమ్మలే మా ఇరేస్మసులు (Erasmees). ప్రమాణాలను రూపొందించే సామర్థ్యం ఒకరికీ లేనప్పుడు ప్రమాణాలు ఎలా ఏర్పడతాయి ?

19వ శతాబ్ది మధ్యకాలంలో కేంబ్రిడ్జి - కాంకార్డు మండలిగా ప్రఖ్యాతి పొందిన ఎమర్సన్, లాంగ్‌ఫెలో, లోవెల్, హోమ్స్, ఆల్కాట్స్ యూరోపు భావావేశానికి ప్రతినిధులు. అన్ని ధోరణులను, అన్ని ప్రభావాలను వారు కాచివడపోసారు. నవ్య మానవతావాదులు విట్మన్, థొరూ, పోలను - కొంతవరకు హాథారన్‌ను వెలివేసేరు. ఒంటరి వాళ్లను చేసేరు. పనికిరాని చెత్త కింద తీసి పారేసారు. తీవ్రంగా అధిక్షేపించేరు. విలియమ్ డీన్ హోవెల్స్ అడుగు పెట్టిన తర్వాత మొదటి సారిగా మా కొక ప్రమాణ మంటూ ఏర్పడింది. అయితే ఆ ప్రమాణం చాలా చెడ్డది.

హోవెల్స్ మృదువుగా, మధురంగా, నిజాయితీగా ఉండేవ్యక్తి. కాని మతాధికారి నివాసంలో తేనీరు త్రాగడంలో అమితానందాన్ననుభవించే పవిత్రురాలైన వృద్ధ కన్యకుండే నియమాలు ఆయన కున్నాయి. ఆయన అపవిత్రతను అశ్లీలాన్ని మాత్రమే కాక హె.బి.వెల్స్ చెప్పిన 'జీవితపు గరుకు సుఖాల'నన్నింటినీ ద్వేషిస్తాడు. ఆయన తన అద్భుత జీవన దర్శనాన్ని అమాయికంగా వాస్తవిక దర్శనంగా భావిస్తాడు. అందులో రైతులుంటారు, నావికులుంటారు, కార్మికులుంటారు. కాని రైతుల చేలెప్పుడూ గెత్తం అంటదు. నావికులెప్పుడూ బూతుపాటలు పాడరు. కార్మిక హస్తం దయాళువైన యజమానికేసి చాచి ఉంటుంది. వాళ్లంతా ఫ్లారెన్స్ పర్యటించే అవకాశం కోసం ఎదురుచూస్తూ ఉంటారు. ముష్టి వాళ్ల ప్రశాంత మృదు దరహాసంతో కనిపిస్తారు.

హోవెల్స్‌లో కూడా ఈ మర్యాద గాఢంగా కనిపిస్తుంది. సంక్లిష్టమైన రెండు ప్రపంచ యుద్ధాల మాధ్య కాలంలోని తన సమకాలికులనందరను ఆయన తన నవ్య మానవతా తత్త్వంతో విస్తృతంగా ప్రభావితుల్ని చేయడంలో సమర్థుడయ్యాడు.

మన రచయితలందరిలోనూ గొప్పవాడని చెప్పుకోదగ్గ మార్క్‌ట్వైన్‌ను ఆయన మచ్చిక చేసుకున్నాడు. నిప్పులు కక్కే ఆ ఆదిమ మానవుణ్ణి సూటు బూటు హేటు ధరించే అధునాతన బుద్ధివాదిగా మార్చేడు. ఇప్పటికీ ఆయన ప్రభావం పూర్తిగా మాసిపోలేదు. హేమ్లిన్ గార్లండ్ నేటికీ ఆయన నారాధిస్తాడు. గార్లండ్ ఏరకంగా చూసిన హోవెల్స్ కన్న గొప్పరచయిత. కాని ఆయన హోవెల్స్ ప్రభావంతో కరడుకట్టిన, ఉన్నత స్థాయి వాస్తవిక వాదం నుండి మెత్తబడిన, గుర్తింపును కోల్పోయిన ఉపన్యాసకుని స్థాయికి జారుకున్నాడు. గార్లండ్ ఈనాడు అమెరికా సాహిత్యానికి సర్వోన్నతాధికారి. అభిరుచి వైకల్యం గల మన యువ రచయితలంతా ఆయనకు స్త్రీ పురుషులందరూ ప్రార్థనా గ్రంథాల ననుసరించి ప్రేమించుకోరని, సామాన్య ప్రజలు అప్పుడప్పుడు మెయిన్‌రోడ్లులోని మహిళా సాహిత్య సంస్థలో వినడానికి వీలుకాని భాషనుపయోగిస్తూ ఉంటారని ఆయన హెచ్చరిస్తూ, సూచన చేస్తూ ఉంటారు. ఈ హేమ్లిన్ గార్లండ్ అనే ఆయనే యువకుడుగా ఉన్నప్పుడు బోస్టన్‌కు వెళ్లి హోవెల్స్ సంస్కృతిని ఒంట బట్టించుకోక ముందు అత్యంత సాహసోపేతమైన, అద్భుతావిష్కారాలు కలిగిన Main-Traveled Roads and Rose of Dutcher's Coolie అనే రెండు వాస్తవికవాద నవలలను రాసేడు.

ఆ పుస్తకాలను నేను బాల్యంలో మిన్నెసోటాలోని కుగ్రామంలో ఉండగా చదివేను. గార్లండ్ కథల్లోని వాతావరణమంతా అక్కడ అలాగే ఉంది. అవి నన్నెంతగానో ఉద్వేజితుణ్ణి చేసాయి. ఫ్రెంచి, ఇంగ్లీషు సామాన్య ప్రజానీకాన్ని చూసిన వారిని చూసినట్లే వర్ణించడం నేను బాల్జాక్, డికెన్సు రచనలలో చూసేను. అలాంటి వర్ణన సాధ్యమే అనిపించింది. కాని సాక్‌సెంటర్, మిన్నెసోటాలలోని ప్రజలను చూసినవాళ్లు ఏమనుకుంటారో అలాగే రాయడం ఇంతవరకు జరగలేదు. మనం నివసించే మధ్య పశ్చిమ గ్రామాలన్నీ సంపన్నంగా, సుఖంగా ఉంటాయి. అందుకే కాల్పనిక సంప్రదాయమూ అలాగే ఉంది. మనలో ఏ ఒక్కరూ న్యూయార్కు, పారిస్, స్టాక్‌హోమ్‌లలోని మెయిన్‌రోడ్లలో కళ్లు చెదరే అనైతికతలో మన పొరుగున జీవన సౌఖ్యాన్ని ఇచ్చి పుచ్చుకోవడానికి ముందుకు రారు. కాని గార్లండ్ రాసిన Main Traveled Roads నవలలో ఒక వ్యక్తి మధ్య పశ్చిమ ప్రాంతంలోని రైతులు భయకంపితులుగా, ఆకలిగొన్న వారుగా, ముసుగు పడిన వారుగా సాహసోపేతులుగా నిశ్వసించడాన్ని నేను కనుగొన్నాను. ఈ దర్శనంతో నేను విముక్తిని పొందేను. జీవితాన్ని కొనసాగుతూన్న జీవితంగా నేను రాయగలను.

అమెరికాను విలియమ్ డీన్ హోవెల్స్ దర్శించిన రీతిగా ప్రకాశమానంగా కాక, నేను చూసిన దానిని చూసినట్లుగా రాయగల అవకాశాన్ని గార్లండ్ నాకు కల్పించారని నేను రాసినందుకు ఆయన ఏ మాత్రము సంతోషించడని, నీదునిక్కిలి తీవ్రమైన వ్యాకులపాటుకు లోనవుతాడని నేను భయపడుతున్నాను. స్వేచ్ఛాపూరితమైన మా దేశంలో, ఎవరైతే ముందుగా స్వేచ్ఛాపథాలను త్రవ్వి తీర్చేరో, ఆ గార్లండ్ లాంటి మహనీయులు, తమంతతాముగా శృంఖలాబద్ధులు కావడం ఆయన దౌర్భాగ్యంగా చెప్పాలి. అంతకు మించి అది పరిపూర్ణమైన అమెరికా దౌర్భాగ్యమని చెప్పాలి.

ఈ కాలమంతటా హోవెల్స్ వంటి వ్యక్తులు అమెరికాను ఇంగ్లండులోని మత పీఠాలుండే నగరాలకు వెలిసిపోసిన ప్రతికృతిగా తయారుచేయడానికి అవిచ్ఛిన్నమైన ప్రయత్నం కొనసాగించేరు. అయితే అమెరికాలో మెల్‌విల్లె, విట్మన్, డ్రైజర్, జేమ్స్ హునెకెర్, మెంకెన్ వంటి దురుసుతనం, ఋజుత్వం గల రచయితలున్నారు. మా దేశం తేనీటి బల్ల మర్యాదల కంటె చెప్పుకోదగిన గొప్పతనం కలదని నొక్కి చెప్పేరు.

ప్రమాణాలు లేకుండానే మేము నిలదొక్కుకున్నాము. బహుశా మేము ప్రమాణాలంటూ ఏమీ సృష్టించక పోవడమే నెత్తురు మండిన, శక్తులు నిండిన మా యువరచయితలకు మంచిదేమో. ప్రాణాధికమైన నామాతృదేశాన్ని గూర్చి ఇంతవరకు ఎంతో నిరాశా పూరితంగా పలికిన తర్వాత ఈ చావు పాటను అత్యంత చైతన్యవంతమైన ఆశా గీతంతో ముగించాలనుకుంటున్నాను.

అమెరికా సాహిత్య భవితవ్యం కోసం నాకెన్నో ఆశలు, విశ్వాసాలు ఉన్నాయి. భద్రత మతిస్థిమితం నమ్మశక్యం కాని మందకొడితనంతో కూడిన సంకుచితత్వం నుండి మునిమాపునుండి మేము బయట పడుతున్నాము. బలీయమైన అనుభూతులు నిండిన, యథార్థమైన సాహిత్యాన్ని సృష్టించే అమెరికా యువకులెందరో ఉన్నారిప్పుడు. వాళ్లలో ఒకడుగా నన్ను చూసుకోవడానికి నా ముసలితనం బాగా అడ్డు వస్తోంది.

ఎర్నెస్ట్ హెమ్మింగ్వే మొలక మీసపు యువకుడు. అత్యంత ప్రగాఢ అనుభవాలతో సుశిక్షితుడైనవాడు. తనపైన ఉన్నత ప్రమాణాల తీర్చిదిద్దబడిన వాడు. జీవనం సర్వస్వంలో గూడు కట్టుకొని నివసించే వాడు. నిజమైన కళాస్రష్ట. థామస్ వుల్ఫ్ ఇంచుమించుగా ముప్పైయేళ్ళ యువకుడు. Look Home Ward, 'Angel' అన్న ఒకే ఒక్క నవల రాసేడు. ఆ నవల మా సాహిత్యంలోని ఉత్తమ రచనలతో సరిపోల్చ దగినది. జీవితం పట్ల గొప్ప సంబరం కల బృహన్నిర్మాణమది. థార్న్‌టన్ విల్డర్ ఉన్నాడు, వాస్తవికవాద యుగంలో ప్రాక్తన అనశ్వర ముగ్ధ శృంగార స్వప్నాలను మళ్లీ కలగంటూ ఉంటాడు. జాన్ డాస్ పాసోస్ ఉన్నాడు, బాబిట్ చెప్పిన భద్రత మతిస్థిమితం అనే ప్రమాణాలను ద్వేషిస్తాడు. ధగధగలాడే విప్లవాన్ని ప్రేమిస్తాడు. స్టీవెన్ బెనెట్ ఉన్నాడు, జాన్ బ్రౌనుకు సంబంధించిన అద్భుత జ్ఞాపకాలతో, అనాసక్త అమెరికా సాహిత్యంలో ఐతిహాసిక రచనను పునఃప్రతిష్ఠాపన చేసేడు. మైకేల్ గోల్డ్ ఉన్నాడు, తూర్పు దిశలోని యూదుల సరిహద్దులకు కొత్త ద్వారాలు తెరిచేడు. విలియమ్ ఫాక్నర్ ఉన్నాడు, దక్షిణ ప్రాంతానికి బుట్టగౌన్ల (hoop skirts) నుండి విముక్తి కల్పించేడు. ఇంకా ఒక డజనుమంది కవులు, నవలాకారులు ఉన్నారు, వాళ్లలో చాలామంది ఇప్పుడు పారిస్‌లో నివసిస్తున్నారు. వాళ్లలో ఎక్కువమంది జేమ్స్‌జాయిస్ ప్రభావంలోపడి కొంచెం మతిచెడ్డ వాళ్లయ్యారు. ఎంత మతిచెడ్డ వాళ్లయినా వాళ్లు నాగరికంగా సాంప్రదాయికంగా మందకొడిగా ఉండడానికి ఒప్పుకోరు.

వారికి నా అభివందనం, పర్వతశ్రేణులతో, పచ్చగడ్డిమైదానాలతో, మహా నగరాలతో, బిలియన్ల ధనంతో, టన్నుల కొద్దీ విశ్వాసంతో నిండిన అమెరికాకు దృఢసంకల్పానిచ్చే వారి నుండి దూరంగా తొలగింప బడనందులకు, రష్యాలా అపూర్వమైనది. చైనాలా సంకీర్ణమైనది. విస్తృత సాహిత్యంతో సంపన్నమైనది అయిన అమెరికాకు దగ్గరగా నిలిపినందుకు వారికి నా అభివందనం. *(సమాప్తం)*

# సమాచారం - ప్రసారం

- వింజనంపాటి రాఘవరావు

పూర్వం కాశీయాత్రకు వెళ్ళినవాడు కాటికి వెళ్ళినవాడు సమానం అనేవారు. అలాగే మక్కాయాత్రకు వెళ్ళినవాడు తిరిగి వచ్చిన దాఖలా లేనట్లే చెప్పుకునేవారు. ఈనాడు పరిస్థితి మారిపోయింది. ఏదేశమేగినా ఎందుకాలిడినా క్షణాల్లో మన గురించిన సమాచారం ఎక్కడకైనా పంపవచ్చు. ప్రపంచం మొత్తం వార్తాపత్రికలు, రేడియో, ఫోను, టీవీ, ఇంటర్నెట్‌ల ద్వారా మన ఇంట్లోకి వచ్చేసింది.

గంగా తీరంలో కుంభమేలా జరిగే సమయంలో ఓ విదేశీయుడు ఓ మహానుభావుణ్ణి ఓ ప్రశ్న అడిగాడు. ఇంతమంది జనం ఇక్కడ చేరటానికి ప్రచారంకింద ఎంత ఖర్చు చేస్తారు? అని. దానికి ఆయన ఓ కేలండర్ చూపి, దానిలో ఒక రోజుకు సంబంధించిన సమాచారం ముద్రించటానికి అయ్యే ఖర్చు అని లెక్క చెప్పాడట. మన దేశానికి సంబంధించినంత వరకు ఇది నిజం.

మనిషి తన తెలివితేటల ద్వారా ఈ సమాచార సాధనాలను సృష్టించాడు. మరి ప్రకృతిలో ఈ సమాచార ప్రసారం ఎలా జరుగుతుంది? కొంచెం ఉత్సాహాన్ని కలుగ జేసే ప్రశ్న ఇది.

మీరు చిన్నప్పుడు పంచ తంత్ర కథలను వినే ఉంటారు. వినే ఉంటారు అని ఎందుకంటున్నానంటే కథలు వినటానికి బాగుంటాయి చదవటంకన్నా. వాటిల్లో ఒకటి చీమ, పావురము, వేటగాళ్ళకథ.

నీళ్ళలో మునిగిపోతున్న చీమను పావురం కాపాడుతుంది. కృతజ్ఞతగా పావురాన్ని చంపబోతున్న వేటగాణ్ణి కుట్టి, చీమ పావురాన్ని కాపాడుతుంది. ఈ కథ ఆధారంగా సమాచార ప్రసారం ఎలా జరుగుతుందో పరిశీలిద్దాం. సమాచార ప్రసారాన్ని జంతువులకు సంబంధించి రెండు భాగాలుగా అధ్యయనం చేయవచ్చు. 1. శరీర అంతర్గత సమాచార ప్రసారం అంటే శరీరం లోపల జరిగే విషయాలప్రసారం. 2. బాహ్య విషయాల సమాచార ప్రసారం.

సమాచారం ఒకస్థలం నుండి మరొక స్థలానికి ప్రయాణించటానికి వ్యవస్థ కావాలి. ఈ విషయాన్ని కథ ఆధారంగా విపులంగా పరిశీలిద్దాం.

చీమ మునిగి పోవటం పావురం చూసింది. అంటే దృశ్యరూప సమాచారం పావురం మెదడుకు చేరింది. మెదడు ప్రేరేపించడం వలన ముక్కుతో ఆకును తుంచి చీమ సమీపానికి వదిలింది. ఇక్కడ మెదడు నుండి ఆజ్ఞ కళ్ళకూ కండరాలకు వెళ్ళింది. అలాగే చీమ వేటగాడిని చూడటం, కుట్టడం, బాధకు బాణం గురి తప్పడం. ఈ మొత్తం ప్రక్రియ బాహ్య, అంతర్గత సమాచార వ్యవస్థలు సమన్వయంతో పని చేయటం వలన సాధ్యమౌతుంది.

ముందుగా అంతర్గత సమాచార వ్యవస్థను గూర్చి స్థూలంగా పరిశీలిద్దాం. ఒకే కణం ఉండే అమీబా వంటి జీవులలో జీవపదార్థం ద్వారా సమాచార ప్రసారం జరుగుతుంది. బహుకణజీవులలో ప్రత్యేకంగా నాడీ వ్యవస్థ ఏర్పడింది. మొదట్లో ఈ నాడీ వ్యవస్థ అత్యంత సరళంగా ఉన్నప్పటికీ, తర్వాత మెదడు ఏర్పడింది. కాంతి, స్పర్శ, రుచి మొదలైన గ్రాహకాలు సమాచారాన్ని సేకరించి నాడుల ద్వారా మెదడుకు అందిస్తాయి. మెదడు ఈ సమాచారాన్ని విశ్లేషించి అవయవాలకు తగు ఆదేశాలను ఇస్తుంది. అంటే అంతర్గత సమాచార వ్యవస్థకు మూలం నాడులు, మెదడు. ఈ అంతర్గత సమాచార వ్యవస్థ లేకపోతే ఏమౌతుంది? మనం ఎక్కువ సేపు కదలకుండా కూర్చుంటే కాళ్ళు తిమ్మిరెక్కుతాయి. లేచి

---

వి. రాఘవరావు, నాగార్జునసాగర్, ఏపిఆర్‌జెసికళాశాలలో జంతుశాస్త్ర ఉపన్యాసకులుగా పని చేస్తున్నారు.

నిలబడలేం, నడుస్తున్నా అడుగు ఎక్కడ పడుతుందో తెలియదు. అసలు కాలు ఉందో లేదో కూడా తెలీదు, వాస్తవానికి ఇక్కడ ఏం జరిగింది కాలు నుండి సమాచారం ప్రధాన నాడీ వ్యవస్థకు చేరలేదన్న మాట. అయితే ఈ తిమ్మిరెక్కటం తాత్కాలికమైనది. అదే పక్షవాతం వచ్చిన వారిలో ఇది శాశ్వతంగా ఉండిపోయి, సమాచార ప్రసారలోపం వలన ఆ అవయవం పని చేయకుండా పోతుంది. నాడీ వ్యవస్థ లేని స్పంజికల వంటి జీవులలో సమాచారం ప్రసారం జరగదు. అందుచేత వాటిని కత్తిరించినా బాధను ప్రదర్శించవు.

మన శరీరంలోని కణాలు ఒక దానితో ఒకటి సంభాషించుకుంటాయని శాస్త్రజ్ఞులు విశ్వసిస్తున్నారు. అయితే అది రసాయన భాష దాన్ని అర్థం చేసుకోగలిగితే వ్యాధులను తేలిగ్గా నయం చేయవచ్చని శాస్త్రజ్ఞుల భావన. ఇప్పుడు బాహ్య విషయాల సమాచారం గురించి పరిశీలిద్దాం. బాహ్య విషయాల సమాచారం రెండురకాలు. ఒకటి జాత్యంతర సమాచారం. అంటే ఒకే జాతి జంతువుల మధ్య ఇచ్చిపుచ్చుకొనే సమాచారం. రెండు విజాతి సమాచారం. అంటే రెండు వేర్వేరు జాతులకు చెందిన జీవుల మధ్య సమాచార ప్రసారం.

ముందుగా ఒకే జాతి జీవుల మధ్య సమాచార ప్రసారం ఎలా ఉంటుందో పరిశీలిద్దాం. ఒకే జాతికి చెందిన జీవుల మధ్య వాసన ద్వారా, ధ్వని ద్వారా, కదలికల ద్వారా, అనువంశిక లక్షణాల ద్వారా సమాచార ప్రసారం జరుగుతుంది.

ఏమిటి సంగతి? పాప ఏడ్చింది. ఎందుకేడ్చింది? ఏడుపు ద్వారా పిల్లలు పెద్దలకు సమాచారం తెలుపుతున్నారు. పిల్లల అన్నిరకాల ఏడుపులూ ఒకే విధంగా ఉండవు. ఆకలి వేసినపుడు ఏడుపు ఒకరకమైతే, పక్క తడుపుకొని ఏడ్వటం మరోరకంగానూ, భయపడ్డపుడు ఇంకోరకంగానూ, మారాం చేసే ఏడుపు మరో రకంగానూ ఉంటుంది. ఇన్ని ఏడుపుల మధ్య తేడాను తల్లి గుర్తించగలదు. సరిగ్గా ఇలాగే ఇతర జంతువులు కూడా తమ పిల్లల నుండి సమాచారాన్ని గ్రహిస్తాయి. అలాగే పిల్లలూనూ.

పిల్లల కోడిని గమనించారా? ఏదైనా ప్రమాదం వచ్చినపుడు తల్లి కోడి ప్రత్యేకమైన శబ్దం చేస్తుంది. అంతే పిల్లలన్నీ క్షణంలో తల్లి రెక్కల కింద చేరిపోతాయి. ప్రతి తల్లి పక్షి ప్రత్యేకమైన శబ్దాన్ని చేస్తుంది. ఆ శబ్దానికి మాత్రమే పిల్లలు ప్రతిచర్య చూపుతాయి. ఇంకెవరూ ఆ శబ్దాన్ని అనుకరించలేరు. కుక్కలు మొదలైన జంతువులలో ధ్వని, వాసనలే కాక ప్రవర్తన కూడా ముఖ్యమైన సమాచార ప్రసార సాధనం. నాలుగైదు వారాల వయసున్న కుక్క పిల్లలు, తల్లి నోటి వద్ద ఎగురుతూ మారాం చేస్తుంటాయి. ఈ ప్రవర్తనను విశ్లేషిద్దాం. సాధారణంగా కుక్కజాతి జీవులు ఆహారం ఎక్కువగా దొరికినపుడు వీలయినంత ఎక్కువగా తింటాయి. పిల్లలవద్దకు వచ్చి ఆ ఆహారాన్ని కక్కుతాయి. పిల్లలు ఆ ఆహారాన్ని తింటాయి. ఆహారం ఇంకో జీవికి అందకుండా పిల్లలకు తేవటానికి వాటికి ఉన్న వెసులుబాటు ఇదొక్కటే. అందుకే కుక్క పిల్లలు తల్లి దగ్గరచేరి ఆహారాన్ని వాంతి చేయమని మారాం చేస్తాయి. దీనితో ఎంతవరకు సంబంధం ఉందో తెలీదుకాని, 'కక్కిన కూటికి ఆశపడే వాడు' అంటూ వ్యక్తుల మనస్తత్వాన్ని విశ్లేషిస్తుంటారు.

కుక్కలలో తోక, చెవులు ప్రధానమైన సమాచార ప్రసార సాధనాలు. కుక్క చెవులు వెనక్కి వంచి తోకాడిస్తుంటే మనతో లేదా మరో కుక్కతో స్నేహ పూర్వకంగా ఉండాలనుకుంటుందన్న మాట. తోక నిటారుగా ఉంటే తన స్థానం గురించి నిర్భయంగా ఉన్నదని, నేలకు సమాంతరంగా ఉంటే తన స్థానంపై సందేహం ఉన్నదని, తోక కాళ్ళమధ్యకు ముడిస్తే తనస్థానాన్ని వదులుకొన్నట్లు అని జంతుప్రవర్తనా విశ్లేషకులు భావిస్తారు. తోక ముడిచిన కుక్కపై ఇతర కుక్కలు దాడి చేయవు - మనుష్యులు తప్ప. ఇలాగే పెంపుడు జంతువులు ఒక్కొక్కటి ఒక్కోరకంగా సమాచారాన్ని నిరంతరం

మనకు అందిస్తూనే ఉంటాయి. ఆ సమాచారాన్ని మనం అందుకోలేక మనం, పాముబారినుండి పిల్లవాణ్ణి కాపాడిన ముంగిసను చంపిన ఇల్లాలిలాగా - సెంపుడు జంతువులను బాధిస్తూనే ఉంటాం.

ఒంటరి జీవితం గడిపే జీవులు ఋతు సమయంలో తప్ప మిగిలిన సమయంలో స్వజాతి జీవులతో సంబంధాలు పెట్టుకోవు. అదే సాంఘిక జీవనం గడిపే జీవులలో జాత్యంతర సమాచారం ప్రసారం నిరంతరం సాగుతుంటుంది. అందుకే ఈ జీవుల నిత్యవ్యవహారానికి భాష అవసరం. మన దృష్టిలో అది సరళమైన సంకేత భాషే కావచ్చు. వాటి అవసరాలకు అది సరిపోతుంది. ఆదిమానవుడు సంకేత భాషే వాడేవాడు. మనం కూడా ఈనాటికీ సంకేతాలు లేకుండా వాక్యాన్ని అర్థవంతంగా పూర్తి చేయలేం.

సంఘ జీవులలో చీమలు మొదలైనవి స్పర్శ ద్వారా, వాసన ద్వారా సమాచారాన్ని తెలుపుకుంటాయి. తేనెటీగలు వీనితోపాటుగా ప్రత్యేకమైన నృత్యం ద్వారా సమాచారాన్ని ఒకదాని కొకటి అందించు కుంటాయి. తేనెపట్టుకు దగ్గరలో పూల తోట ఉన్నట్లయితే, ఆ విషయాన్ని కనుగొన్న తేనెటీగ తేనెపట్టువద్ద వృత్తాకారపు వలయాలలో తిరుగుతుంది. దీన్ని Round Dance అంటారు. అదే ఆహారం దూరంగా ఉన్నట్లయితే తేనెటీగ ఎనిమిది ఆకారంలో తిరుగుతుంది. దీన్ని వాగల్ డాన్స్ అంటారు. మిగిలిన తేనెటీగలు, నృత్యం చేసే తేనెటీగ శరీరం నుండి వచ్చే వాసనను బట్టి ఆహారం ఎక్కడ ఉందో వెతకటానికి వెళతాయి. ఈ వ్యవహారాన్నంతా కార్ల్‌వాన్‌ఫ్రిష్ అనే జర్మనీ దేశపు జంతు ప్రవర్తన శాస్త్రవేత్త కనుగొన్నాడు.

పక్షులు జతకట్టే సమయంలో మగ పక్షి, ఆడ పక్షిని ఆకర్షించడానికి రకరకాల విన్యాసాలు చేస్తుంది. అలాంటిదే మయూర నృత్యం. నెమలి నాట్యం అంటూ స్త్రీలు నాట్యం చేస్తారు. వాస్తవానికి నృత్యం చేసేది మగనెమలి మాత్రమే. అలాగే కోయిలలు కమ్మటి గొంతుతో గానం చేస్తాయి. ఈ కోయిల కూత కూడా స్త్రీ జీవిని ఆకర్షించడానికే. అవి జతకట్టే సమయం వసంత కాలం కాబట్టి మావి చిగురూ, కోయిల పాటా వైరాలు కవుల కవిత్వానికి సామాగ్రి అయ్యాయి. ఇలాంటిదే వర్షాకాలంలో కప్పల బెకబెక ధ్వనులూ, చిమ్మెటలు, కీచురాళ్ళు చేసే ధ్వనులూ. మనకు వినిపించే ధ్వనులన్నీ శ్రావ్యంగా లేకపోయినా, ఆధ్వని సమాచార ప్రసారంలో ఎవరో ఒకరికి తోడ్పడుతుందని గ్రహించాలి.

మరి శబ్దం చేయలేని, వాయుగత శబ్దాలను గ్రహించలేని జీవులేం చేస్తాయి? కీటకాలల్లో స్త్రీ జీవులు మనం పసికట్ట లేని వాసనను వెలువరిస్తాయి. వీటిని ఫెరమోన్లు అంటారు. ఒక కిలోమీటరు దూరం వరకూ ఈ వాసన వ్యాపించి, మగ కీటకాలను ఆకర్షిస్తుంది. ఈ విషయాన్ని పరిశోధించిన శాస్త్రవేత్తలు పంటలకు హాని కలిగించే కీటకాల ఫెరమోన్లు కృత్రిమంగా తయారు చేశారు. వీటిని 'ఇకస్కెక్టట్రిప్' లలో ఉంచడం వలన మగ జీవులను పట్టి చంపేస్తారు. ఫలితంగా గ్రుడ్ల ఫలదీకరణం ఆగిపోయి పంటలు రక్షింపబడతాయి. వాయుగత శబ్దాలను గ్రహించలేని పాముల వంటి జీవులుకూడా స్త్రీ జీవి శరీరం నుండి వెలువడే వాసనను గ్రహించి దగ్గరకు వస్తాయి.

కుటుంబ జీవితం, సంఘ జీవితం గడిపే జీవులలో, చాలావరకు విషయాలు తల్లి దండ్రుల నుండి పిల్లలకు తెలుస్తాయి. వేటాడటం, శత్రువుల బారి నుండి తప్పించుకోవటం, ఇతర సహచరులతో కలిసి తిరగటం మొదలైనవన్నీ సాంఘిక జీవితంలోనే జీవులు నేర్చుకుంటాయి. కుక్కపిల్లలు ఒక దానిని ఒకటి వెంటబడి తరమటం, కొరుక్కోవటం, ఆట మాత్రమే కాదు భవిష్యత్తులో జీవితం సాగించటానికి అవసరమైన సమాచారాన్ని ప్రోది చేసుకోవటం.

సంఘ జీవితానికి దూరమైన జీవులు ఎలా ప్రవర్తిస్తాయి? ఆ మధ్య బీజింగ్ జూలో మూడు ఆడ చింపాంజీలు పిల్లలను కన్నాయి. కాని అవి పిల్లలను దగ్గరకు తీసుకోవటం కాని, పాలివ్వటం కాని చేయలేదు. దీనిపై అధ్యయనం చేసిన శాస్త్రవేత్తలు, సహజపరిసరాలలో చింపాంజీలు ఎలా

ప్రవర్తిస్తాయో తెలిపే వీడియో సినిమాలను వాటికి చూపించారట. తర్వాతనే అవి తమ పిల్లలను ముద్దు చేయనారంభించాయట.

అలా సంఘ జీవితానికి దూరమై అడవిలో పెరిగిన వాడి కథే మౌగ్లీకథ 'జంగిల్ బుక్'. సాంఘిక జీవనానికి దూరమైన వారుకూడా కొన్ని విషయాలలో ఇతరుల లాగానే ప్రవర్తిస్తున్నారు కదా! ఇదెలా సాధ్యం?

పుట్టగానే ప్రతి జీవిలోనూ కొంతసమాచారం నిక్షిప్తమై ఉంటుంది. ఇది క్రోమోజోములలో ఉండే DNA లో ఉండి, ఒక తరాన్నుండి మరొక తరానికి అందించబడుతుంది. అప్పుడే గ్రుడ్డు నుండి వెలువడిన పిల్ల వెంటనే ఆహారం కోసం వెతుకుతుంది. శత్రువుల బారి నుండి తప్పించుకునే ప్రయత్నం చేస్తుంది. దీనికి కారణం సహజ సిద్ధంగా దానిలో ఉండే సమాచారమే. దీన్నే మనం 'ఇన్స్టింక్ట్' అంటాం. మనం ఎన్ని విషయాలు నేర్చుకున్నా, ఈ సహజ స్వభావం మనలను వదలదు. అందుకే 'స్వభావో దురతి క్రమః' అన్నారు. ఈ సహజ స్వభావాన్ని గుర్తించటానికి ఓ ప్రయోగం చేశారు.

బాతులను కొన్ని తరాల పాటు నీరు తెలియకుండా కోళ్ళతో పాటుగా పెంచారు. ఒకసారి కోళ్ళనూ బాతులనూ నీటిమడుగు వద్దకు తీసికెళితే బాతులు నీటిలోకి దిగి ఈదుతూ వెళ్ళిపోయాయి. కోళ్ళు నీటి ఒడ్డున ఆగిపోయాయి. ఈదటం అన్న సహజ గుణం బాతుల జన్యువుల్లో ఉండి అవకాశం వచ్చినప్పుడు బయటకు వచ్చింది - తన శక్తి తనకు తెలియని ఆంజనేయుడి లాగా. అలాగే పదహారు పదిహేడు రోజుల వయసున్న కోడిగ్రుడ్ల వద్ద, తల్లి కోడి చేసే హెచ్చరిక ధ్వని వినిపించారు. వెంటనే గ్రుడ్డులోని పిల్లలు కదలటం గమనించారు. అంటే తరతరాలుగా దేనికి ఏ జాగ్రత్త తీసుకోవాలి అన్న సమాచారం జన్యువుల్లో నిక్షిప్త మౌతుందున్నమాట. ఇది వింటుంటే తల్లి గర్భంలోనుండి అభిమన్యుడు యుద్ధవ్యూహాలు నేర్చుకోవటం కథ గుర్తొస్తుంది కదూ! శాస్త్రవేత్తలు ఈ విషయం ప్రయోగాత్మకంగా నిరూపించారు. మనం తల్లి గర్భంలో ఉండగానే వివిధ రకాల శబ్దాలను, తండ్రి, ఇతర కుటుంబ సభ్యుల గొంతు గుర్తించగలమట. అంటే సమాచార ప్రసారం ఒక తరం నుండి మరొక తరానికి అవిచ్ఛిన్నంగా అందుతుందన్నమాట.

రోడ్ల మీద ఆవులూ, మేకలూ విశ్రాంతిగా నెమరు వేయటం చూస్తూనే ఉంటాం. ఈసారి జాగ్రత్తగా వాటిని గమనించండి. రెండు జంతువులు ఉంటే ఒకదాని వీపు మరొక దానికి ఆనించి పడుకుంటాయి నాలుగు ఉంటే నాలుగు దిక్కులకూ తలలు ఉంచి పడుకుంటాయి. అరణ్యాలలో ప్రమాదం ఎటునుంచి వస్తుందో తెలియదు అందుచేత ఆవిధంగా పడుకుంటాయి. ఇది సహజ సిద్ధంగా వచ్చే లక్షణం పట్టణంలో ప్రమాదాలేవీ లేకపోయినా సహజప్రవర్తనను అవి కోల్పోవు.

అలాగే క్వయిల్ అనే పక్షులు కూడా అన్ని వైపులకూ తలలు ఉంచి వృత్తాకారంలో పడుకుంటాయి. శత్రువు వచ్చినపుడు గుంపుగా ఒక్కసారి లేస్తాయి దానితో శత్రువు పారిపోతుంది. శత్రువులను బెదిరించటానికి జంతువులు తమ ఆయుధాలను ప్రదర్శిస్తాయి. ఆవులు మేకల వంటి జీవులు కొమ్ములు ప్రదర్శిస్తే, కుక్కలు, కోతుల వంటివి కోరలను ప్రదర్శిస్తాయి. అంతేకాక తమశరీరం ఉన్నదానికన్నా పెద్దదిగా చూపే ప్రయత్నం చేస్తాయి - ఇవేవీ ఫలించక పోతే పారిపోతాయి - ఇదంతా నా దగ్గరకు వస్తే ప్రమాదం జాగ్రత్త అన్న సమాచారం శత్రువుకు అందించేయత్నమే.

జాగ్రత్తగా పరిశీలిస్తే - ప్రకృతిలో ప్రతి శబ్దానికీ ఓ అర్థం ఉంది. ప్రతి వాసనకూ ఓ వ్యాఖ్యానం ఉంది. ప్రతి స్పర్శలోనూ వినబడని వాక్యం ఉంది. కొంచెం ఓపిక చేసుకుంటే అన్ని జంతువుల భాషలనూ మనం మాట్లాడవచ్చు మంత్ర తంత్రాల సహాయం లేకుండా.

(ఆకాశవాణి విజయవాడవారి సౌజన్యంతో)

# ''హోలీ బైబిల్లో కృష్ణానది''

– సంయుక్త కూనియ్యి

దైవాలకు పుట్టినిల్లు భారతదేశం. రాముడు, కృష్ణుడు, బుద్ధుడు మానవులుగా పుట్టి, మానవుల మధ్యే దైవ స్వరూపులుగా మన్ననలందుకుని మహానుభావులుగా మారారు. రామాయణంలో రాముని గురించి, మహాభారతంలో కృష్ణుని గురించి, బౌద్ధంలో బుద్ధుని గురించి చాలా వివరాలు చెప్పబడివున్నాయి. పురావస్తు పరిశోధనా శైలి ప్రారంభమయినప్పటి నుంచి, అనాదిగా నమ్ముతూ వచ్చిన సిద్ధాంతాలకు ''సత్యపరిశోధన'' అగ్ని పరీక్షలా నిలిచింది. భారతావనిని ఆర్య భూమిగా నమ్ముతూ వచ్చారు. కాని క్రీ. శ. 1921వ సంవత్సరం నుంచి, వెలుగులోకి వచ్చిన ''సింధూ నాగరికత'' అడ్డుగోడలా నిలచి, ఆర్య ఆధిక్యతను ఖండించసాగింది. కొత్తవరవడిలో పాత నమ్మకాలు కొట్టుకుపోతున్నాయి. కాబట్టి మనం ''మనకు తెలుసు'' అనుకున్న నిజాల్ని గురించి మళ్ళీ తెలుసుకోవలసిన అవసరం ఏర్పడింది. ముందు రాముడు పుట్టాడు. ఆ తర్వాత రాముడే కృష్ణుడుగా పుట్టాడని పురాణాలు చెబుతున్నాయి. కాని చరిత్రకారుల పరిశోధనలో ముందు వెలుగులోకి వచ్చినవాడు కృష్ణుడే. ''మహాభారత యుద్ధం క్రీ. పూ. 3102లో జరిగి వుంటుందని అనుకున్నారు. ఆధార పూర్వకంగా పరిశీలిస్తే, ఇది అసంభవం అని తేలింది. క్రీ. పూ. 15వ శతాబ్దంలో జరిగివుంటుందని భావించారు, కాని పురావస్తు పరిశోధన ప్రకారం చూస్తే ఇది కూడ సంభవం కాదన్నారు. చివరికి మహాభారతయుద్ధం, క్రీ. పూ. 9వ శతాబ్దం ఆరంభంలో జరిగివుంటుందని భావిస్తున్నారు.[1]* పురావస్తు పరిశోధనతో మహాభారత కథ, వేదకాలం నుంచి, బుద్ధుని పుట్టుక కన్నా, కాస్త ముందు కాలానికి వచ్చింది.

''కథానాయకుడిగా చెప్పబడిన కృష్ణుడి కన్నా, పచ్చిక బైళ్ళలో ప్రేమ కలాపకుడిగా చెప్పబడిన కృష్ణుడి మూలం వ్యత్యాసంగా వుంది. కృష్ణుడి పేరుకి అర్థం ''నలుపు'' (Black) అందువలననే కృష్ణుడి వర్ణణ వచ్చినప్పుడు ''నల్లని కృష్ణుడు''గా వర్ణించబడ్డాడు. ''నల్లనివాడు (Mayon), పిల్లనగ్రోవి (Flute) వాయిస్తూ, గొల్లభామలతో ఆడుకొంటున్నాడు'' అని కృష్ణుని గురించి 'తమిళం' (Early Tamil Anthologies) లో పూర్వకాలంలోనే వ్రాసివున్నారు. కాబట్టి కృష్ణుడు దక్షిణాదికి చెందిన 'కామదేవుడు' అయి వుండవచ్చును. సంచారగోపాలకుల ద్వారా కృష్ణపూజ ఉత్తరానికి వ్యాపించింది. క్రీస్తు శకారంభంలో, ఈ సంచారక గోపాలకులు Malwaకి Western Deccan చేరుకున్నారు. కృష్ణపూజను ప్రాముఖ్యంలోకి తెచ్చినవారిలో ''అభిరులు'' (Abhiras) ముఖ్య పాత్ర వహించినట్లు భావిస్తున్నారు. ఆకాలంలో కృష్ణుని ''కృష్ణగోవింద''గా పిలుస్తూ పూజించారు. ''కృష్ణగోవింద''కి అర్థం, గోపాలకుల నాయకుడు (Lord of Herdsman) అని. కృష్ణుని గోపాలకుల నాయకుడుగా ''కృష్ణగోవింద'' అని పిలవటం సహజంగానే వుంది. ''గోవింద'' 'ప్రాకృతి' పదం అయివుండవచ్చును. మార్పులేకుండా సంస్కృతంలోకి చేర్చబడింది. ఎందుకనగా, సంస్కృతంలో సరైన అర్థంతో పలకాలంటే ''గోపేంద్ర''(Gopendra) గా పలకవలసి వుంటుంది. సనాతనులు 'గోవింద' పదం అసలు సిసలైన సంస్కృత పదంగా భావిస్తున్నప్పటికీ, 'గోవింద'ని సంస్కృతంలోకి తర్జుమా చేస్తే ''గోవులను

---

సంయుక్త కూనియ్యి, జూబ్లీహిల్స్, హైదరాబాద్, పరిశోధక విద్యార్థిని,
ఇటీవలే బహరైన్ నుండి వచ్చారు.

కనుగొన్నవాడు' (Cow-Finder) గా అర్థం వస్తుంది.[2★] చారిత్రక పరిశీలనలో ''కృష్ణుడు ఆర్యుడు కాదు, ద్రావిడానికి చెందినవాడని'' చెప్పబడటం, గమనించవలసిన విషయం. ''అభిరుల'' ప్రచారం ద్వారా ''కృష్ణగోవింద''గా కృష్ణుడు పూజలందుకున్నాడు.

''కృష్ణ, క్రీస్తు ఇద్దరికి చాలా పోలికలున్నాయి. ఇద్దరు చాలా మహిమలు చేసి చూపించారు. అంతే కాక ఇద్దరి పేర్ల మధ్య "Etymologically" సంబంధం వున్నట్టనిపిస్తుంది. క్రీస్తు (Christ, Latin Chritus) గ్రీకు భాషలోని క్రిష్టోస్ (Christos) నుంచి వచ్చిన పదం. The "Anointed" (Greek Khrein "To Anoint" but also "To Dye" "To Colour" Khrisma Ointment) సంస్కృతంలో చెప్పబడిన కృష్ణ పదానికి అర్థం 'నలుపు' లేదా 'బ్లూ' అని. (Christus, Krishna రెండు పదాలకి సంస్కృతానికి చెందిన 'Krish' పదం మూలమై వుంటుంది. Krish పదానికి ''ఆకర్షించు'' అనే అర్థం వుండటం వలన Etymology ఆధారంగా కృష్ణపేరుకి ''అందర్ని ఆకర్షించువాడు'' (The all Attracting one) అని అర్థం కూడా వుంది.[3★]

సప్తసతి ద్వారా దక్కన్‌లో ''భగవతి పురాణం'' ప్రచారంలో వున్నట్టు తెలుస్తుంది. కామకలాపాలతో నిండివున్న కృష్ణుని కథ, ''భాగవతానికి'' మూలాధారంగా వుంది. కృష్ణుడు, గోపికలతో నిండివున్న ''వసుదేవ'' పూజ, సంచారగోపాలకులైన అభిరుల సాంస్కృతిపై ప్రభావం చూపింది. శాతవాహనుల కాలంలో అభిరులు ఆధిక్యతలో వున్న జాతివారిగా చెప్పబడివున్నారు. ఆ తర్వాత కాలంలో విజయపురికి చెందిన ఇక్ష్వాకు రాజులతో సంబంధం వుంచుకున్నారు. ''అభిరవసుసేన'' అనే పేరున్న అధికారి ''అష్టభుజస్వామి'' విగ్రహాన్ని, ఇక్ష్వాకు ''ఎహువల చాంతమూల'' పరిపాలనా కాలంలో, విజయపురి దగ్గర వున్న సేతగిరి గుడిలో ప్రతిష్టించాడు. 'దక్షుడు తిరిగి సజీవుడైన తర్వాత, 'అష్టభుజ నారాయణ'గా విష్ణుకి జన్మనిచ్చినట్టు 'భాగవత పురాణం'లో చెప్పబడివున్నది.[4★] శాతవాహనుల కాలంనాటికే, అనగా ఇరవై రెండువందల సంవత్సరాల క్రితం నుంచే అభిరులు (Abhiras) ఆధిక్యత వున్న తెలుగు జాతివారు కావటంవలన, కృష్ణుడి నిజ చరిత్ర తెలుసుకోవలసిన కనీస ధర్మం తెలుగువారికి ఏర్పడింది.

''కృష్ణుడి మూలం, సత్వతుల (Satvatas) కు చెందిన ''అంధకావిష్ని'' (Andhakavishni) తెగకు చెందింది. 'అందకు' (Andhakas)లే, 'ఆంధ్రు' (Andhras)లుగా చెప్పుకునేందుకు కావలసిన ఆధారం వుంది. వీరు ద్రావిడులు. Mr. Law అభిప్రాయం పరిశీలిస్తే, ''ఆంధ్రా'' పదమే పాలిభాషలో ''అంధక'' గా చెప్పబడింది. Etymologically పరిశీలిస్తే, ''అంధా'', ' ఆంధ్రా' ఒకటేనని తెలుస్తుంది. Vincent Smith కూడ "Andhakas"ని ద్రవిడులని, వారు తెలుగు మాట్లాడతారని పేర్కొన్నారని, Mr. Law తెలియజేసివున్నారు. Srinivas Iyengar కూడ ఈ అభిప్రాయంతో ఏకీభవించారు. వింధ్యపర్వత ప్రాంతంలో ఆంధ్రావారు నివసించినట్టు అభిప్రాయం వెలిబుచ్చారు. Mr. Law వివరించిన, ప్రకారం ''అంధక పదం'', ముల్లక (Mullaka) మరియు అస్సక (Assaka) వీరికి కూడ వర్తిస్తుంది. బౌద్ధ రచనల ప్రకారం, అస్సక, ముల్లక తెగలవారు వింధ్య పర్వతాల దగ్గరలో వున్న గోదావరి నదీ తీరాన నివసించినట్లు తెలుస్తుంది. ముఖ్య విషయం ఏమిటంటే, వింధ్య పర్వత ప్రాంతాల చుట్టూ అతి దగ్గర పోలికలతో, సంబంధాలతో విస్తరించిన పలుతెగలకు చెందిన

అనార్యులను, అందకులుగా పిలిచినట్లు ఇందుమూలంగా తెలుస్తుంది. ఇందులోని ఒక తెగలో పుట్టిన కృష్ణుడ్ని వీరందరూ దైవంగా కొలిచారు. ఇందులో గమనించవలసిన ముఖ్య విషయం ఏమిటంటే, అభీరులు తెలుగు వారు కావటమేకాక, వారు పూజించిన కృష్ణుడు ఆంధ్రులకు మూలపురుషుడు కావటం వలన, కృష్ణుడిపేరు ఆంధ్రాలో ప్రవహిస్తున్న కృష్ణానదికి పెట్టుకున్నారు.[5★]

''ఆంధ్రరట్టా (Andhraratta) లో జనపదాలుగా, అస్సక, ముల్లకులను గురించి బౌద్ధ రచనలలో తెలుపబడివున్నది. తెలివాహ (Telivaha) నదీ తీరాన 'ఆంధ్రనగరి' వున్నదని తెలుపబడింది. తెలివాహనది కృష్ణా నదిగా గుర్తింపబడివున్నది. ఎందుకనగా, ఈనది నల్లగా (Looking Like "Taila-Oil" Vaha - Carrier) నూనె వాహనంలా ప్రవహిస్తుండటం వలన, కృష్ణానదిగా చెప్పబడింది. కాబట్టి కృష్ణా నది వొడ్డునవున్న 'ధాన్యకటక' ఆంధ్రనగరిగా చెప్పబడింది. ఈ విషయాన్ని బలపరుస్తున్న ఆధారం A.D. 300లో పల్లవరాజైన శివస్కందవర్మ చెక్కించిన Mayidavolu శాసనంలో ఆంధ్రపత రాజధానిగా 'ధాన్యకటక' లిఖించబడి వుంది. ఆంధ్రనగరి, లేదా ధాన్యకటక పేర్లు, బౌద్ధ రచనలలో విరివిగా వ్రాయబడివుండటానికి కారణం, అప్పటికే బౌద్ధమతం ఈ ప్రాంతంలో ప్రాముఖ్యత వహించి వుండటమే.[6★] నూనెవాహనంలా నల్లగా ప్రవహిస్తున్న కృష్ణానది, నల్లని శరీరధారుడైన కృష్ణుడిపేరుతో నిలిచిపోయింది. తెలివాహ నది కృష్ణానది ఒకటే కావటం, ఆ నదివొడ్డున ధాన్యకటకం వుండటం చరిత్ర తెలియజేస్తున్న అతి ముఖ్యమైన విషయాలు.

''అశోక చక్రవర్తి శాసనాల (Edicts) ద్వారా, ఆంధ్రులు Eastern Dekkanలో గోదావరి, కృష్ణా నదుల మధ్య నివసించినట్లు తెలుస్తుంది. శెరవనీయ జాతక కథలో తెలివాహనది వొడ్డున ఆంధ్ర నగరి వున్నట్లు తెలుస్తుంది. ఈ నదిని కొందరు, మహానదికి ఉపనది అయిన Tel నదిగా పేర్కొని వున్నారు. ఈ Tel నది ఆంధ్రప్రదేశ్ Borders లో ప్రవహిస్తుంది. "Raychaudhuri" వివరికి తెలివాహ నదిని కృష్ణా నదిగా వొప్పుకున్నారు. జాతక కథలు, మరియు ఇతర బౌద్ధ రచనలు, ఆంధ్రజన పదాలుగా అస్మక, ముల్లక ప్రజలను పేర్కొని వున్నారు. వీరు కళింగానికి తూర్పు తీరాన వున్నట్లు తెలియజేయబడివున్నది. గ్రీకు జియోగ్రాఫర్ ''ప్లినీ (Pliny) గంజాం, ''కోసలా'' లకు దక్షిణాన, ఆంధ్రుల దేశం వున్నట్లు, వారు చాలా శక్తివంతమైన జాతివారుగా వివరించి వున్నాడు. ఇంకా, వారికి రక్షణ దుర్గాలున్న పట్టణాలు చాలా వున్నట్లు, వారు తమ మహారాజుకు సైనిక, అశ్విక దళాలతో పాటు ఏనుగులు కూడ సరఫరా చేస్తున్నట్లు ప్లినీ తెలియజేసివున్నాడు. క్రీ. శ. 300 సంవత్సరంలో, పల్లవ రాజైన శివస్కందవర్మ చెక్కించిన 'Mayidavolu' శాసనంలో ధాన్యకటక, ఆంధ్రపత (Andhrapatha)లో వున్నట్లు చెప్పబడివుంది. మహాభారతం ద్వారా, ఆంధ్రులు మైసూరు వరకు విస్తరించివున్నట్లు తెలుస్తుంది. కాబట్టి, అతిపురాతనకాలం నుంచి, ఆంధ్రులు, ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ విస్తరించివున్న భూభాగంలోనే, ఇంచుమించు వ్యత్యాసంతో విస్తరించుకుని నివసిస్తూ వచ్చారు.[7★] దీని ద్వారా తెలుగువారి పూర్వీకత ఎంత పాతదో చెప్పుకునేందుకు బలం చేకూరుతుంది.

ఋగ్వేదంలో భాగమైన "Aitraiya Brahmana" లో తెలుగు వారిని గురించి చెప్పబడివుంది. అతి పురాతన మైన వేదం క్రీ. పూ. 1200 - క్రీ.పూ. 1000లో చెప్పబడింది.[8★] 'భాగవద్గీత'

భారతీయుల న్యాయస్థానాలలో స్థానం పొంది వుంది. క్రైస్తవులకు Holy Bible, ముస్లీములకు Kuran, ఎలా మతగ్రంథాలుగా నిలిచివున్నాయో, అలాగే ''భగవద్గీత'' హిందూ మతగ్రంథంగా పరిగణించబడింది. శ్రీకృష్ణుడు, అర్జునుడికి గీతోపదేశం చేసిన మహాభారతంలో తెలుగు వారు కూడ స్థానం సంపాదించి వున్నారు. కాబట్టి తెలుగువారికి, కృష్ణుడికి మధ్య సంబంధం వుందా? అని ఆలోచించేందుకు అవకాశం ఏర్పడి వుంది.

''కళింగని (ఒరిస్సా) పరిపాలించిన ''ఖారవేల'' (Kharavela) మహారాజు చెక్కించిన 'హతిగుంప' (Hathigumpa) మరియు గుంటుపల్లి (Guntupalli) శాసనాలలో, కళింగ మహారాజు సైన్యం ''కన్నబెన్న'' (Kannabenna) అనగా కృష్ణానది వరకు చేరుకున్నట్టు, మూషిక నగరాన్ని (Mushikanagara) గెలుసుకునేందుకు బెదిరించినట్టు వ్రాయబడటమే కాక, గోదావరి, కృష్ణా నదుల భూభాగం కోసం, మొదటి శాతకర్ణి - ఖారవేలల మధ్య పోరాటం జరిగినట్టు, లిఖించబడి వుంది. కాని ఖారవేల గెలిచినట్టు ఎక్కడా వ్రాయబడలేదు.[9★]

''నానెగట్ గుహలోని ఒక శాసనం, మొదటి శాతకర్ణి భార్య నాగనిక (క్రీ. పూ. 180 - 170) తన భర్త మరణానంతరం చెక్కించింది. [10★] మొదటి శాతకర్ణి, క్రీ. పూ. 180వ సంవత్సరానికన్నా ముందువాడు కావటం వలన, క్రీస్తుపూర్వం, రెండవ శతాబ్దం నాటికే, కృష్ణానదికి, ''కన్నబెన్న''గా పేరు చెప్పబడి వుంది. ''కోటిలింగాల (Koti Lingala) లో శాతవాహన రాజ్యాన్ని స్థాపించిన ''సిముఖ'' (Simukha) కి, కన్హ (క్రిష్ణ) కి, మొదటి శాతకర్ణికి సంబంధించిన బంగారు నాణ్యాలు లభించాయి.[11★] కన్హ, కన్నా, కృష్ణ, కిషన్, కిసన్, కన్హయ్య, వగైరా పేర్లు ఇప్పటికి కృష్ణుడికి వున్న పలురకాలపేర్లుగా వాడుకలో వున్నాయి.

''పరాయి దేశస్థులు వ్రాసిన గ్రంథాలలో, 'మెగస్తనీస్' వ్రాసిన ''ఇండికా'' గ్రంథంలో, ఆంధ్రులను గురించి, వారి సైనిక బలగాన్ని గురించి వ్రాయబడివుంది. పేరు తెలియని గ్రీకు రచయిత వ్రాసిన "Periplus of The Erythrean Sea"లో ఆంధ్రాని గురించి వ్రాయటమే కాక, Masalia (Machilipatnam) ని గురించి కూడ వ్రాయబడివుంది. దీనినే "Maisolia" గా కూడ పిలవటం వలన, Masalia, Maisolia రెండు ఒకటేనని గుర్తించారు. ఇది ఆంధ్ర రాజ్యంలో, అతిపెద్ద Market స్థలంగా Ptolemy చెప్పివున్నాడు.[12★]

ఆంధ్రదేశానికి సంబంధించిన వివరాలు, బయటి దేశాలలోని పలుగ్రంథాలలోనేకాక, Holy Bible (హోలీ బైబిల్) ల్లో కూడ వ్రాయబడి వున్నాయి. "Holy Bible, Old Testament, The Book of Ester. Chapter - 1. Verse - 1 'Now it came to pass in the days of A-Has-U-E'Rus, (This is A-Has-U-E'Rus which reigned, from India, even unto E-Thi-opi-A, over an hundred and seven and twenty provinces)

హోలీ బైబిల్‌కి చెందినవారికి భారతదేశానికి సంబంధం వున్న విషయం హోలీబైబిల్ వ్రాసినవారే వొప్పుకుంటున్నారు. Holy Bible, Old Testament. "Judges" Chapter - 4 Verse - 7."

And I will draw unto thee to the river Kishon Sisera, the captain of Jabin's Army with his Chariots and his multitude, and I will deliver him in to thine hand.

Verse - 13, and Sisera gathered together all his chariots, even nine hundred chariots of Iron, and all the people that were with him, from horosheth of the gentiles unto the river of Kishon.

Verse - 21" The river of Kishon swept them away, that ancient river, the river Kishon, O my soul, thou hast trodden down strength.

హోలీ బైబిల్‌లో పురాతనమైన నదిగా చెప్పబడుతున్న Kishon నది ఇజ్రాయిలీ దేశంలో ఎక్కడాలేదు. Kishon నదిగా చెప్పబడిన కృష్ణానది పురాతన కాలం నుంచి ఇప్పటివరకు ఆంధ్రదేశంలో ప్రవహిస్తూనే వుంది. Sisera పేరు కూడ మనకు తెలిసిందే. మనకున్న నాలుగు ఋతువులలో ఒక ఋతువు పేరు ''శిశిర'' ఋతువు.

"Holy Bible" Old Testament, Joshua, Chapter - 16. Verse - 7. And it went down from Janohath to Ata-Roth and to Naarath, and came to Jericho and went out at Jordan. హిందూ పురాణాలలో కలహప్రియుడిగా పేరుగాంచిన నారదుడి పేరు తెలియనివారుండరు. శ్రీకృష్ణుడికి సంబంధించిన ''పారిజాత అపహరణం'' లో నారదుడి పాత్ర చాలా ముఖ్యమైనది. ''నారదుడు, 'వీణ'ను తయారు చేశాడు, సంగీత మునిగా పేరుగాంచాడు''[13]★ హిందూ పురాణాలలో ప్రాముఖ్యత వహించిన నారదుడి పేరు, హోలీ బైబిల్లో ఒక ప్రదేశానికి పెట్టబడివుండటం, గమనించవలసిన విషయం.

Holy Bible Old Testament. Joshua - Chapter - 16. Verse - 8. "The border went out from Tappu-Ah Westward unto the river Kanah, and the goings out there of were at the sea, this is the inheritance of the tribe of the children of Ephra-im by Their families. హోలీ బైబిల్లో సముద్రంలో కలుస్తుందని చెప్పబడిన Kanah నది, ఆంధ్రప్రదేశ్‌లో క్రీస్తుకు పూర్వమే Kannabenna నదిగా చెప్పబడివున్నది. ఆంధ్రప్రదేశ్‌లో ''Kanha అనగా కృష్ణా అని అర్థం.'' పూర్వకాలమే చెప్పబడివున్న కృష్ణానది ఇప్పటికీ ఆంధ్రప్రదేశ్‌లో ప్రవహిస్తూ వెళ్ళి, బంగాళాఖాతంలో కలుస్తుంది.

"Holy Bible" Old Testament. Joshua. Chapter, 19. Verse - 20. And Rabbith, and Kishion and Abez. హోలీ బైబిల్లోని పై వాఖ్యంలో Kishion వ్యక్తిపేరుగా వ్రాయబడివుంది. మనదేశంలో నార్త్‌లో కిషన్ పేరువుంది.

Holy Bible, Old Testament. Joshua. Chapter - 19. Verse - 28. "And Hebron and Rehob, and Hammon, and Kanah, even unto Great Zidon" హోలీ బైబిల్లోని పై వాఖ్యంలో Kanah పేరు, ప్రదేశం పేరుగా వ్రాయబడివున్నది. మనకు కన్నయ్య, కన్నమ్మ, కన్నా, కానహ్ (Kanah) పేర్లు వున్నవి.

Holy Bible, Old Testament. Joshua - Chapter - 19. Verse - 36. "And Ada-Mah, and Ramah, and Hazor. రాముడు భారతీయులకు దేవుడు, రామ పేరు బైబిల్లో చాలా వాఖ్యాలలో వుంది.

Holy Bible, Old Testament. Joshua, Chapter - 19, Verse - 43 "And Elon and Thimna -Thah and Ekron. తిమ్నాత పేరుకు సంబంధించిన చాలా పేర్లు మనకు వున్నాయి. మహామంత్రి తిమ్మరుసు, తిమ్మప్ప, తిమ్మాపురం, తిమ్నాద (Lord of Monkeys) పేరు హనుమంతునిది. ''హనుమంతుడు కోతి దైవం, ఆయన వాయుదేవుడి కుమారుడు, రాముడికి స్నేహితుడు, సేవకుడు. రామాయణం ప్రజాదరణ పొందక ముందునుంచే హనుమంతుడు ప్రజాదరణ పొంది వున్నాడు. ఇప్పటికి ఆయన ప్రాముఖ్యత వహించిన గ్రామ దేవుడిగా వున్నాడు. చాలా గుడులలో మానవ శరీరంపై కోతితలవున్న దేవుడిగా పూజింపబడుతున్నాడు. ఈయన శుభాలను చేకూర్చి కాపాడే దైవం, కాబట్టి ఈయనగౌరవార్థం, కోతులను పవిత్రంగా చూస్తున్నారు.[14]★

'ఇండియాకు, West కి మధ్యవున్న సంబంధం భాషద్వారా పరిశీలించబడింది. కొన్ని హిబ్రుపదాలు భారతదేశానికి చెందిన మూల పదాలుగా చెప్పబడినవి. ముఖ్యంగా "Koph" కోతి (సంస్కృతంలో కపి), మరియు "Tukki" నెమలి (తమిళంలో తోగై) The Book of Kings లోని వివరాలు చరిత్ర పరంగా ఖచ్చితమైనవి కాకపోయినప్పటికి, Tharshish నావికులు, Solomon మహారాజుకు వెండి, దంతం, కోతులు, నెమళ్ళు తీసుకువచ్చి ఇచ్చారు అని రాసివుంది. కాబట్టి పురాతన కాలంలోనే హిబ్రూలు ఇండియా నుంచి తమకు కావలసినవి తెప్పించుకున్నట్లు తెలుస్తుంది.[15]★

హోలీ బైబిల్లో King Solomon కథలో చెప్పబడిన Ophir ప్రదేశం కేరళలోని Puvar (పువ్వార్) ప్రదేశంగా, కేరళవారు గర్వంగా తమ చరిత్రలోని భాగంగా చెప్పుకుంటున్నారు.[16]★

తెలుగువారు కూడ పలురకాల చరిత్రలను పరిశీలించి, తమకున్న చారిత్రక విలువలను తెలుసుకోవాలి.

"Holy Bible" Old Testament. Judges - Chapter - 14 Verse - 1 and Samson Went down to Timnath, and saw a woman in Tim-Nath of the Daughters of the Phi-Lis-Tines". Timnath - తిమ్నాథ్ పేరు మనకు తెలిసిందే.

Holy Bible Old Testament. Joshua, Chapter - 21. Verse 7. "The Children of Merari by their Families had out of the Tribes of Reuben and out of the Tribe of Gad, and out of the Tribe of Zebu-Lun, Twelve Cities. ఈ వాఖ్యంలో వున్న Merari పేరు మనకు మురారిగా వుంది. కృష్ణుడికి మరోపేరు మురారి. ''జయకృష్ణా, ముకుందా, మురారి'' అంటూ భక్తులు పాడుతుంటారు.

Holy Bible, Old Testament, 1-Chronicles. Chapter - 23. Verse - 21" The sons of Merari, Mahli, and Mushi, the sons of Mahli, E-Leazar and Kish.

ఈ వాఖ్యంలో మురారి కుమారులుగా చెప్పబడినవారు Mahli, మరియు Mushi. తెలుగు వారి చరిత్ర ప్రకారం చూసుకుంటే మూషికలు తెలుగువారు, మూషికనగరం క్రీస్తుపూర్వమే మనకుంది. Mahli కుమారులు Eleazar మరియు Kish. Kishion - Kish పేర్లు కిసన్‌గా పలకబడుతున్న కృష్ణుడికి సంబంధించినవే.

Holy Bible, Old Testament, Psalm - 83, Verse - 9 "Do unto them as unto the midianites, as, to Sisera, as to Jabin, at the Brook of Kison." ఇంతకుముందు Ancient River Kishonగా వ్రాయబడినదే, ఈ వాఖ్యంలో Kison నదిగా వ్రాయబడివున్నది.

ప్రాకృతిలో Simukha (221 - 198 B.C.) అయిన రాజుపేరు సంస్కృతంలో Srimukha గా చెప్పబడింది. ప్రాకృతిలో కిసన్‌గా చెప్పబడిన పేరు కృష్ణగా సంస్కృతంలో చెప్పబడింది. హోలీ బైబిల్లో కృష్ణుడికి సంబంధించిన పేర్లు ప్రాకృతంలో చెప్పబడివున్నవి. ఆ పేర్లు సంస్కృతంలో లేనందువలన, హోలీ బైబిల్లోని కృష్ణపేర్లు ద్రావిడానికి చెందినవిగా తెలుస్తుంది.

"Punch Marked నాణ్యాలపైన కన్నా, వ్రాతలేని నాణ్యాలపైన తక్కువ చిహ్నాలు చెక్కబడి వున్నవి. Hollo Cross లాంటి కొన్ని చిహ్నాలు చాలా విరివిగా చెక్కబడినవి... Ujjain, Hollow Cross, Three Arched Hill వంటి కొన్ని చిహ్నాలు Punch Marked నాణ్యాలపైన చెక్కలేదు. ఈ చిహ్నాలు వ్రాతలేని నాణ్యాలపైన విరివిగా చెక్కబడినవి''[17]★ ఆంధ్రదేశంలో వ్రాతలేని నాణ్యాలు (Uninscribed coins) క్రీ.పూ. 600-300 సంవత్సరాలవరకు ముద్రించారు. ఈ నాణ్యాలు ఎవరు ముద్రించారో? తెలియజేసే వివరాలు లేవు. వ్రాత అనేది వీటిపైన చెక్కబడలేదు. అందువలనే వీటిని Uninscribed Coins" అన్నారు. ఈ నాణ్యాలపైన కేవలం Symbols మాత్రమే చెక్కబడివున్నవి. ముఖ్యంగా Hollow Cross విరివిగా చెక్కబడివుంది. క్రీ.పూ. 500 సంవత్సరాల క్రితం చెక్కబడిన మెగాలితిక్ రాతి శిలువలు మనకు వున్నాయి. నాణ్యాలపైన కూడ Hollow Cross చెక్కబడి వుండటానికి కారణం ఏమిటి? క్రీస్తు శకానికి ముందే, ఆంధ్రదేశంలో క్రైస్తవ చిహ్నాలు ఉపయోగంలో వుండటానికి గల కారణం ఆలోచించవలసిందే.

క్రీ. శ. 1947లో Dead Sea Scrolls ఇజ్రాయలీదేశంలో దొరికాయి. అవి క్రీస్తుపూర్వం తొలి శతాబ్దానికి, చెందినవి. అందులో Isaiah Scroll క్రీ.పూ. 150వ సంవత్సరానికి చెందింది. ఆ తర్వాత కాలంలో Khirbet Qumran పరిసరాలలో మరోపది గుహలు కనుగొన్నారు. ఆ గుహలలో మరిన్ని Scrolls దొరికాయి. (మేక తోలుపైన సిరాతో వ్రాయబడిన దాన్ని Scroll అంటారు). Essenes చెప్పిన బోదనలు Scrolls లో వ్రాయబడివున్నవి. క్రైస్తవ మతంలో చెప్పినవన్ని, Essenes, Scrolls లో వివరంగా వ్రాసివున్నారు. అందువలన జీసస్‌కన్నా ముందు క్రిష్టియానిటి వుందని నిరూపణ అవుతున్నది[18]★

పై వివరాల ద్వారా తెలుస్తున్న విషయం ఏమిటంటే, జీసస్ క్రైస్ట్ ఎప్పుడు పుట్టాడో? సరిగ్గా తెలుసుకోవలసిన అవసరం ఏర్పడుతుంది. హోలీ బైబిల్లో చెప్పబడిన Herod మహారాజు మరణాన్ని అనుసరించి జీసస్ క్రైస్ట్ క్రీస్తు శకం ప్రారంభం అప్పటికి నాలుగు సంవత్సరాల బాలుడై వుండవచ్చునని కొందరి అభిప్రాయం. King Herod ని ప్రక్కకి పెడితే, క్రైస్ట్ ఎప్పుడు పుట్టింది, ఎక్కడ పుట్టింది కనుగొనె అవకాశం లేదు. మునుపటి కన్నా ఎక్కువ శ్రద్ధతో చరిత్రను పరిశీలించవలసి వస్తుంది. అందునా క్రైస్ట్‌కి, ఆంధ్రప్రదేశ్‌కి వున్న సంబంధం విడదీయలేని అవినాభావ సంబంధంలా వుంది. అందువలన హోలీ బైబిల్ని అతిక్షుణ్ణంగా పరిశీలించి, నిజాలు తెలుసుకోవలసిన అవసరం ఏర్పడింది.

## Reference Books:-


1) **"The Wonder that was India"** Page - 39, by *A.L. Basham.* Third Revised Edition. Thirty - Sixth Impression 2001. Published by -Rupa & Co. 7/16, Ansari Road, Daryaganj, New Delhii - 110 002, India.

2) **"The Wonder that was India"** Page - 305, by *A.L. Basham.*

3) **"Jesus Lived in India"** Page - 126. His Unknown life before and after the crucifixion, by - *Holger Kersten,* Published by - Element Books Limited. 1994, Printed - 1999.

4) **"Religion in Andhra"** Page - 225, Archaeological Series No. 69. (A Survey of Religious developments in Andhra from early times upto A.D. 1325), by - *Dr. B.S.L. Hanumantha Rao.,* M.A. Ph.D., Published By - Director, Dept. of Archaeology and Museums, Government of A.P. Hyderabad, Year 1993. India.

5) **"Hinduism at Cross - Roads"** Page - 38, 39, by - *P.S. K. Pandian,* I.A.S., First Published in - 1993, for copies - Data News Features. 12 Journalists' Colony, Road No - 3, Banjara Hills, Hyd - 34. India.

6) **"Religion in Andhra"** Page - 55, by - *Dr. B.S.L. Hanumantha Rao,* M.A. Ph.D.,

7) **"Religion in Andhra"** Page - 13 and 14, by- *Dr. B.S.L. Hanumantha Rao,* M.A. Ph.D.,

8) **"Ancient and Medieval History of Andhra Pradesh"** Introduction Page. (Revised & Enlarged Edition) Year - 1994, by - *P.R. Rao,* Published by - Sterling Publishers Private Limited. L - 10, Green Park Extension, New Delhi - 110 016, India.

9) - 10) **"Ancient and Medieval History of Andhra Pradesh"** Page - 2, by - *P.R. Rao.*

11) **"Ancient and Medieval History of Andhra Pradesh"** Page - 5, by - *P.R. Rao*

12) **"Ancient and Medieval History of Andhra Pradesh"** Page - 4, by - *P. R. Rao.*

13) **"The Wonder that was India"** Page - 318, by - *A.L. Basham.*

14) **"The Wonder that was India"** Page - 315, by- *A.L. Basham.*

15) **"The Wonder that was India"** Page - 230, by - *A. L. basham.*

16) **"Discover India Series"** Road Guide To "Kerala" Printed in 1999. T.T.K. Pharma Limited - Printing Division, 328. G.S.T. Road, Chromepet, Chennai - 600 044. India.

17) **"Andhra Coins Through The Ages"** Page - 31, by *Raja Reddy, Srikanth R. Deme, Madhu R. Deme;* Published by - Palvasha Publishers - 1999, Plot 322. Road No. 25, Jubilee Hills, Hyd - 33. India.

18) **"Jesus Lived in India"** Page - 83, His Unknown life before and after the crucifixion, by - *Holger Kersten,* Published by - Element Book Limited. 1994. Reprint - 1999.

# భారతీయ దర్శనాలు

- శివలింగం

భారతీయ దర్శనాలు ప్రథమంగా సూత్ర రూపంలో వున్నాయి. తరవాత ఆయా దర్శనాభిమానులు భాష్యాలు రాసి వివరించడం జరిగింది. షడ్దర్శనాలు ప్రాచీనాలు. పదకొండవ శతాబ్దంలో ఎవరో సర్వ సిద్ధాంత సంగ్రహం రాశారు. వేద వ్యాసుడు ( మహాభారతం), బౌద్ధాన్ని నాలుగు దర్శన మార్గాలుగా, పూర్వమీమాంసను రెండుగానూ వివరించాడు. పద్నాలుగవ శతాబ్దంలో సర్వదర్శన సంగ్రహం వచ్చింది. పదిహేను దర్శన మార్గాలు వివరించాడు. చార్వాకం, బౌద్ధం, జైనం, రామానుజ దర్శనం, పూర్ణ ప్రజ్ఞ దర్శనం ( మాధ్వ వేదాంతం), నకులీశ పాశుపతం, శైవం ప్రత్యభిజ్ఞా దర్శనం, రసేశ్వరం, వైశేషిక, న్యాయ, మీమాంస, పాణినిదర్శనం, సాంఖ్యయోగ దర్శనాలు. పూర్ణత్వం, ఆత్మ, ఈశ్వరుడు, శ్రుతిస్మృతులు యోగ సమాధి మోక్షాలను భారతీయ వేదాంత దర్శనాలు అంగీకరించాయి. గ్రంథాల్లో పేర్కొన్న దర్శనాలు.

| | |
|---|---|
| ఆస్తిక దర్శనాలు | - వేదాంతం, యోగ, సాంఖ్య, న్యాయ, వైశేషిక పూర్వ మీమాంస వ్యాకరణ దర్శనాలు. |
| నాస్తిక దర్శనాలు | - బౌద్ధం, జైనం, చార్వాకం, అజీవిక దర్శనాలు. |
| శ్రుతులు | - భగవద్గీత, ఉపనిషత్తులు, వేదాలు, బ్రాహ్మణాలు, భాగవతం, పురాణాలు. |
| మత దర్శనాలు | - శైవం, శాక్తం, తంత్రం. |
| సమకాలీన దర్శనాలు | - అరవిందుడు, రాధాకృష్ణన్. |
| బౌద్ధ దర్శనంలోని వివిధాలు | - హీనయానం, మాధ్యమికం, యోగాచారం, సౌత్రాంతికం మహాయానం, వైభాషికం, అభిధర్మం, సర్వాస్తి వాదం. |
| శైవ దర్శనాలు | - శైవం, కాశ్మీరం, వీరశైవం. |
| వేదాంత దర్శనాలు | - అద్వైతం శంకరుడు, రామానుజ విశిష్టాద్వైతం. మాధ్వుని ద్వైతం, వల్లభ శుద్ధా ద్వైతం, నింబార్కుని ద్వైతాద్వైతం, చైతన్యుని అచింత్య భేదాభేదం, యోగ వాసిష్టం, యామునాచార్య విశిష్టాద్వైతం, రామకృష్ణ పరమహంస, శంకరుని ముందు, తరవాత అద్వైతం భేదాభేద దర్శనం. |

**వేదాంత దర్శనాలు:**

వేదాంతం అంటే వేదాల చివరి భాగాలయిన ఉపనిషత్తుల సారాంశం అని భావించనవసరం లేదు.

---

శివలింగం, చల్లపల్లి, వీవర్స్ సొసైటీలో పనిచేసి రిటైర్ అయ్యారు.

ప్రాచీన అర్వాచీన ఉపనిషత్తులున్నాయి. వేదాంతం ఉపనిషత్తులనే భావించక్కర లేదు. వేదాంతోనామ ఉపనిషత్ ప్రమాణం తదుపకారిణి శారీరక శాస్త్రాదినిచ అని సదానందుడు. ఉప - సమీపం, ని - నిశ్చయం, సత్ దూరంగా తీసుకు వెళ్ళడం. ఆత్మ జ్ఞానాన్ని నిశ్చయంగా తెలుపుతుంది. ఉపనిషత్తు, గురువు శిష్యుని దగ్గరగా పిలిచి తనలో రహస్యంగా వున్న సత్యం స్థానాన్ని నిశ్చయంగా చెపుతాడు. అంత - స్వరూపం స్వభావం. వేద రూపం, స్వభావం అని అర్థాలు చెప్పారు. అంతః - నిర్ణయః అని శంకరుడు. ఆత్మ స్థానాన్ని నిశ్చయంగా తెలుసుకోవడం వేదాంతం. తెలిపేవాడు గురువు. అద్వైతాలు చాలా వున్నాయి. శంకరా ద్వైతమే ప్రధానం. రామానుజుడు, వల్లభుడు, చైతన్యుడు, జీవగోస్వామి వంటివారు కొన్ని విషయాల్లో శంకరుని ఖండిస్తూ గ్రంథాలు రాశారు. అనుభవాద్వైతాన్ని ఉదయనుడు పేర్కొన్నా అదొక మార్గంగా రూపొందలేదు. విజ్ఞానవాదులు యోగాచార బౌద్ధులు భావవాద దృక్పథంతో పేర్కొన్నది. కాశ్మీరీ శైవం గాని, వీరశైవం గాని సాంప్రదాయక దర్శన మార్గంగా అంగీకరించడం లేదు.

**శ్రమణ సంప్రదాయాలు - బౌద్ధం, జైనం:**

భారత దేశంలో శ్రమణ సంప్రదాయాలు బౌద్ధ జైనాలు. బుద్ధుని సమస్య జగత్తులోని దుఃఖం. వైయక్తిక దుఃఖం కాదు. దుఃఖ నివారణ. జైన సంప్రదాయంలోని సమస్య అశుద్ధత నుండి శుద్ధత్వానికి కైవల్యాన్ని పొందడం. మహా కరుణకు మూలం హృదయం. హృదయ జలధి అగాధపు లోతుల నుండి పెల్లుబికేది దుఃఖం, కరుణ లేకుండా దుఃఖ నివారణ సాధ్యం కాదు. జైనుల శుద్ధతకు కరుణ అవసరం లేదు. అహింస విషయంలోనూ రెంటికీ తారతమ్యం వుంది.

జైన సంప్రదాయంలో హింస శుద్ధత్వాన్ని మలినం చేస్తుంది. హింస బౌద్ధంలో దుఃఖ కారణం కనుక హింసను నిషేధించడం జరిగింది. రెండూ భిన్నదర్శనాలు. బౌద్ధిక ఆలోచనా ఫలాలు కావు. అంతశ్చేతనోద్యమాలు. మనస్సుకన్నా మానవాత్మ ముఖ్యమైనది. చైతన్యం కన్నా గొప్పది. ఆత్మ జ్ఞానం అనుభవం నుంచి ఆరంభం, ఆత్మ జ్ఞానం ఆలోచన మీద ఆధారపడదు, పురోగమించదు. దర్శనం అంటే చూడటం మీద ఆధారపడింది. అందుకే దర్శన శాస్త్రం అంటారు. చూచేదాన్ని చూడాలంటారు జ్ఞానులు. చూచేది తానై వున్నప్పుడు చూచేదాన్ని చూచేదెవరనేది ప్రశ్న, The eye can see itself అంటారు. దర్పణంలో నీ ప్రతిబింబం చూసుకున్న విధంగానే నీలోకి నువ్వు చూసుకోవడం. బౌద్ధంలో కరుణ ఒకగుణమే కాదు, ధర్మం. హీనయాన, మహాయానాల్లో శాక్యముని మహాకారుణ్య వ్యక్తిత్వం అధిపత్యం వహించింది. బౌద్ధ కళలోనూ కరుణ ప్రతిఫలించింది. కరుణ, బుద్ధుడు బోధించిన మాధ్యమిక మార్గం రెండూ మహా యానావిర్భావానికి దారి తీశాయి. ఎవరినీ, దేన్నీ తిరస్కరించకూడదు. కరుణను ధర్మంగా అంగీకరించినప్పుడే పూర్ణాంగీకారం. కరుణ సకల ప్రాణుల్ని కౌగలించుకుంటుంది. నాగార్జునుడు అందుకే సంసారాన్ని, నిర్వాణాన్ని కలిపేశాడు. మాధ్యమిక మార్గం అనుసరణీయం, ఆచరణీయం, కత్తి మీద సాము వంటిది కూడా. గీత సమత్వం

అని గ్రీకులు టెంపరెన్సు అని అన్నారు. పదును మన ఆచరణ స్థాయిబట్టి వుంటుంది. సాధకుడు పురోగమిస్తూ పదునెక్కి సమత్వాన్ని సాధిస్తాడు. మధ్యేమార్గంలో పయనించడమే ఆచరణ. బౌద్ధుల తృష్ణ, వేద ఋషుల కామం (కోరిక), హెరాక్లిటస్ Ever living Fire - భవరూపం. భవం తనవైపు తిరిగినపుడు స్వస్థానంలోకి ప్రవేశం, అప్పుడే ప్రశాంతి. క్రీస్తు మాటల్లో Passeth all understanding. అది అవగాహన మీద ఆధారపడలేదు. అవగాహనే దానిమీద ఆధారపడి వుంది.

భయంతో సన్యాసం స్వీకరించిన దానికి ప్రేమతో స్వీకరించిన దానికి ఎంతో వ్యత్యాసం. తీర్థంకరుని కైవల్యం లోకసేవకు గాని, ఇతరులకు సహాయ పడటానికిగాని కాదు. ప్రాభాతవేళ నిర్వాణ ప్రాంగణంలో నిలబడి బుద్ధుడు దివ్య చక్షువులతో ప్రపంచాన్ని వీక్షిస్తుంటాడు, తన సహాయం కోసం చిరు దీపం వెలిగించిన వారికి సహాయ పడటానికి. కళలో కూడా ఈ భేదం చూడవచ్చు. జైన కళలో తీర్థంకరుడు అభయ ముద్రలో ఎక్కడా కనిపించడు. బౌద్ధ కళలో బుద్ధుడు అభయముద్రలో కనిపిస్తాడు. తీర్థంకరునిది వైయక్తికం. ఒంటరితనం నుంచి ఒంటరితనానికి పయనం. ప్రేమతో చేసేది గొప్పది కదా! బుద్ధుని ధ్యేయం దుఃఖితులకు ప్రేమతో కరుణతో విముక్తి కలిగించడం.

**అధ్యయన గ్రంథాలు పన్నెండు అవి:**


1. **Cultural Heritage of India** Vol. 3 1953.
2. S.C Chatterjee and D.M. Datta - **An Introduction To Indian Philosophy** - 1975.
3. S.N. Dasgupta - **A History of Indian Philosophy** - 1988 Vol. 1 to 5.
4. T.M.P. Mahadevan - **Invitation to Indian Philosophy** - 1974.
5. Karl Potter - **Encyclopedia of Indian Philosophy** Vol. 1-1995.
6. Swami Prajnananda - **Schools of Indian Philosophical Thought** - 1973.
7. Swami Prabhavananda - **A Spiritual Heritage of India** - 1962.
8. S. Radhakrishnan - **Indian Philosophy.**
9. P.T. Raju - **Structural Depths of Indian Thought** - 1985 .
10. C.D. Sarma - **A Cirtical Survey of Indian Philosophy** - 1987.
11. I.C. Sarma - **Ethical Philosophies of India** - 1965.
12. Heinrich Zimmer - **Philosophies of India** - 1969.



**"మడోన - బిడ్డ"**

అందాల యువతల్లి చబ్బిబుగ్గల (బుగ్గలబూరెల) బాలక్రీస్తు - వినతి ప్రణవం చేస్తున్న దేవదూతలు ఇందులో చిత్రితమయ్యారు.

దీనిని ఫ్రా ఫిలిప్పో లిప్పీ చిత్రించాడు (1406-69)



"ప్రకటన"
దీనిని చిత్రించిన కళాకారుడు నికలస్ పౌసిన్
ఈ దృశ్యంలో మేరీ చేతులు చాచి, వ్యస్తపాదియై దేవదూతను స్వాగతిస్తున్నది